# ఆంధ్రనామసంగ్రహం

కూర్పు

పైడిపాటి లక్ష్మణకవి

# ఆంధ్రనామశేషం

కూర్పు

అడిదం సూరకవి



ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వసంస్థ

హైదరాబాదు-500 004

# AANDHRA NAAMA SANGRAHAM

Based on Aandhra Naama Sangraham of Paydipati Lakshmanakavi
with Aandhra Naama Sesham of Adidam Surakavi

*Published by :* DIRECOTOR & SPECIAL OFFICER, Andhra Pradesh Baalala Akademi
O/o Jawahar Bal Bhavan, Public Garden, Hyderabad-500 004, Phone: 242214



ప్రచురణ సంఖ్య: 105

మొదటి ముద్రణ: 1993

ప్రతులు: 5,000

వెల: రు.35/-

సమాలోచక సంఘం
**ఆచార్య తూమాటి దోణప్ప**
**డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ**
**శ్రీ తాటిపర్తి వెంకారెడ్డి**

సమన్వయకర్త
**కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి**
పరిష్కరణ సహాయకుడు
**శ్రీ జమ్మలమడక కామేశ్వరరావు**
ప్రొడక్షన్ ఎడిటర్
**శ్రీ చొక్కాపు వెంకటరమణ**
చిత్రకారుడు
**శ్రీ ఎం. కనక సూరిబాబు**

ముద్రణ
కార్డ్‌బాక్స్ కంపెని
నాంపల్లి స్టేషన్ రోడ్, హైదరాబాద్-500 001

ప్రతులకు
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమి
O/o జవహర్ బాలభవన్
పబ్లిక్ గార్డెన్స్, హైదరాబాద్-500 004

# ఒక మాట

రోజురోజుకు పెరిగిపోతున్న ఆధునిక విజ్ఞానంతో పాటు మన బాలబాలికలకు తరతరాల నుండి వస్తున్న తెలుగు సంప్రదాయవిజ్ఞానంతో తగినంత పరిచయం కూడా అవసరమని ధృఢంగా ప్రభుత్వం గుర్తించింది.

ఒకప్పుడు తెలుగులో మనం వాడే సంస్కృత పదాల అర్థాలు తెలియడానికి అమరకోశమూ, తెలుగు పదాల అర్థాలు తెలియడానికి నిఘంటుత్రయమూ(ఆంధ్రనామ సంగ్రహం, ఆంధ్రనామ శేషం, సాంబనిఘంటువు) తెలుగు పిల్లల చేత చిన్నతనంలోనే కంఠస్థం చేయించేవారు. ఆ సంప్రదాయాన్ని పునరుద్ధరించే సంకల్పంతో ఆంధ్రనామ సంగ్రహం (ఆంధ్రనామశేషంతో సహా) ఆరో తరగతి పిల్లలకు ఆకర్షకంగా ఉండేట్టు సచిత్రంగా ప్రచురించి అందజేసే ఈ పథకాన్ని రాష్ట్రప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమికి ఒప్పగించింది.

ఆంధ్రనామ సంగ్రహంలోని పదాలు దాదాపు మూడు శతాబ్దాల క్రితం తెలుగు భాషమాట్లాడే ప్రజల వాడుకలో ఉన్న అచ్చతెలుగు పదాలు. ఈ పదాలు మన జాతి సంస్కృతిని తెలియ చేసేపదాలు. కొన్ని అమూర్తపదాల్ని ఈ నిఘంటువులో బొమ్మల ద్వారా పిల్లలకు పరిచయం చేస్తున్నాం. నిజానికి అమూర్తపదాలకు బొమ్మలు వేయటం నిఘంటువు నిర్మాణ దృష్ట్యా సాధ్యంకాదు. అయినా సాధ్యమైనంతవరకు అమూర్తపదాలకు కూడా బొమ్మలు వేయడానికి ప్రయత్నించాం. ఈ విషయాన్ని నిఘంటు శాస్త్ర పండితులు గుర్తించాలని మనవి చేసుకుంటున్నాం.

ఈ గ్రంథం ఈ విధంగా వెలువడడానికి తోడ్పడిన సమాలోచక సంఘం సభ్యులందరికి అకాడమి తరపున నా హృదయ పూర్వక ధన్యవాదాలు

**ఎన్. శారదా అశోకవర్ధన్**
సంచాలకులు మరియు ప్రత్యేకాధికారి.

# ఆంధ్రనామసంగ్రహం

## ప రి చ య ం

ఇదో చిన్న నిఘంటువు. 'ఆంధ్రం' అనేది తెలుగుకు మరో పేరు. 'నామం' అంటేనే పేరు. 'సంగ్రహం' అంటే కుదించిన, క్లుప్తంగా చెప్పిన పుస్తకమని అర్థం. ప్రతిభాషలోనూ దానికి సహజమైన మాటలుంటాయి. చాలా మాటలు ఇతరభాషలనుంచి ఎరువు తెచ్చుకొని వాడుతుంటాం. తెలుగులో ఇతరభాషలనుంచి వచ్చి చేరని మాటలను మాత్రమే ఈ చిన్న నిఘంటువులో చూడగలరు. ఇతర భాషల నుంచి వచ్చి చేరినా తెలుగువారి ఉచ్చారణకు – అంటే మాట్లాడే పద్ధతికి – అనుగుణంగా మారిన ధ్వనులున్న మాటలను కూడా కలిపి 'అచ్చ తెలుగు' అని పిలుస్తుంటాం. అచ్చ తెలుగు మాటల్లో ఒకదానికి ఒకటి దగ్గరగా ఉండి ఒకదానికి బదులుగా మరొకటి వాడదగిన మాటలను కూర్చి చెప్పిన పుస్తకం మిది.

మాటలు ముఖ్యంగా రెండు రకాలు. కంటికి కనిపించే చెట్లు, పుట్ట, బల్ల వంటివి మొదటి రకం. వీటిని 'మూర్తవస్తువు' అంటారు. ప్రాంతాన్నిబట్టి, వస్తువుల స్వభావాన్నిబట్టి, ఉపయోగాన్నిబట్టి భాషలో ఈరకం మాటలు ఒకటికి మించి ఉండవచ్చు. ఉదాహరణకు 'నాగలి'ని కొందరు 'మడక' అంటారు. ఈ రెండు మాటలూ ఒకదాని కొకటి 'పర్యాయపద'మని చెప్తారు. కొద్దిపాటి అర్థ భేదం ఉన్నా పర్యాయ పదాలనే పిలుస్తారు. నిజానికి వీటి మధ్య కొద్ది భేదం ఉండవచ్చు – లేకపోనూ వచ్చు. మచ్చుకు 'తల్లి, అమ్మ, అవ్వ' అనే మాటల్లో మొదటిది మామూలు మాట. కొందరు 'అమ్మ' అని పిలిస్తే మరికొందరు 'అవ్వ' అంటారు. 'అమ్మ' అని పిలిచే వాళ్ళు 'అవ్వ' అనే మాటను 'తల్లి తల్లి' అనే అర్థంలో వాడ్తారు. ఈ భేదాలు భాషను నేర్చుకోవటంలో కొంత శ్రమపడ్డ తర్వాత గాని గుర్తించలేం ఈ నిఘంటువులో ఇటువంటివి పర్యాయ పదాలుగానే కనిపిస్తాయి. వీటిని 'బదులు మాటలు' అని కూడా అనవచ్చు.

రెండో రకం మాటలు మన ఊహలనూ ఆలోచనలనూ అనుభవాలనూ చెప్పేవి. వాటిని 'అమూర్త' పదాలంటారు. అంటే కంటికి కనిపించని, చెవికి వినిపించని విషయాలను చెప్పేవన్న మాట. వీటికీ బదులుమాట లుంటాయి. వాటిని కూడా ఈ నిఘంటువులో చూడవచ్చు.

మాటలను విడివిడిగా చదివితే గుర్తు పెట్టుకోవటం కష్టం. వాటినే పాటల్లోనో పద్యాల్లోనో గుదిగుచ్చి రాస్తే ఒప్పచెప్పటం తేలిక – గుర్తుంచుకోవటం సులభం. ఈ దృష్టితో ఈ నిఘంటువులో పర్యాయ పదాలను పద్యాల్లో రాశారు. పద్యాలు రాస్తే వాటికో ఛందస్సుంటుంది కాబట్టి కొన్ని పెచ్చుమాటలు వాడక తప్పదు. అయినా ముఖ్యమైన పర్యాయపదాలు గుర్తుంచుకునేందుకు వీలుగా ఈ నిఘంటువులో

ఉన్నాయి. అర్థం, అర్థభేదం తెలుసుకోవటం కన్నా ముందు మాటలను స్పష్టంగా చదవటం ప్రధానమని మన పూర్వులు భావించారు. అందువల్లనే వీధిబడుల్లో ఈ నిఘంటువును 'ఆటవిడుపు పద్యాలు'గా ఒప్పచెప్పించే వాళ్లు. కాలక్రమాన ఆపద్ధతి మారింది. ఇప్పుడు పాఠ్యప్రణాళికలో భాగంగా కాకుండా నయినా పిల్లలచేత ఈపద్యాలు చదివించి భాషమీద చిన్న వయసులోనే అభిమానం, అభిరుచి కలిగించాలని భావిస్తున్నాం.

ఒకే విషయాన్ని, ఒకే వస్తువును ఒకటికి రెండు మాటలతో పేర్కొనటం వల్ల అనేకలాభా లున్నాయి. ఒకటి: మన భాష ఎంత విస్తృత మయిందో తెలుస్తుంది. రెండు: తెలుగు మాటలతో మాట్లాడడం అలవాటవుతుంది. మూడు: చదువుకోనివారిని విద్యావంతులు చేయటంలోను, చదువుకున్నవారికి (స్వభాష) మీద అభిమానం పుట్టించటంలోను తోడ్పడుతుంది. వీటన్నిటికన్నా ముఖ్యం విద్యార్థుల ఆలోచనలు స్పష్టంగా, సరళంగా సాగటానికి పనికివస్తుంది. ఏ ప్రత్యేకమయిన మాటను వాడి ఏ ప్రత్యేక మైన అర్థాన్ని సూచించవచ్చో తెలుస్తుంది.

అన్నట్లు అందరం ఆలోచిస్తాం. భాషరానివాడూ మాట్లాడలేనివాడూ ఆలోచిస్తారు. మూగవాళ్లకూ చెవిటివాళ్లకూ సొంత ఆలోచన లుంటాయి. కాని భాష నేర్చిన వాడికి భాషాసహాయం లేకుండా మాట్లాడ టం. ఆలోచించటం చాలా కష్టం. మన ఆలోచనలు ఎంత స్పష్టంగా ఉంటే మన మాటలు అంత సులభంగా ఉంటాయి. అంటే సులభంగా మాట్లాడటంవల్ల మనం స్పష్టంగా ఆలోచించగలుగుతున్నా మని అర్థం. మరి సులభంగా మాట్లాడగలగాలంటే మాటలు రావాలి – బాగా రావాలి – చాలా రావాలి. ఇలా మాటలు నేర్చుకోవటానికి తోడ్పడేవి నిఘంటువులు.

పల్లెటూళ్లో సామాన్యజీవితం గడుపుతున్న వ్యక్తికి ఎన్నో మాటలతో పని లేదు. ఆ వ్యక్తి అవసరాలు తక్కువ. అందువల్ల ఆవ్యక్తి మాట్లాడే మాటలూ తక్కువే. శాస్త్రవిజ్ఞానంలో సరికొత్తగా వచ్చే మాటలనూ అర్థాలనూ తెలుసుకోవాలన్నా, మరొకరికి తెలియజెప్పాలన్నా తనకుగాని, తన చుట్టూ ఉన్న ప్రజలకు గాని సులభంగా అర్థమయ్యే మాటలు తెలుసుకోవటం అవసరం. ఈనాటి విద్యార్థులకు ఎంతో అవసరం. మాతృభాషలో విద్యాబోధన చెయ్యాలన్న సిద్ధాంతానికి ఇదే జీవం – ఇదే ప్రాణం. ఈ కాలంలో విజ్ఞానం విపరీతంగా చాలా తొందరగా పెరిగి పోతున్నది. కొత్త కొత్త ఆలోచనలకు కొత్త కొత్త మాటలు కల్పించు కోవాల్సి వస్తున్నది. తన భాష బాగా వచ్చిన విద్యార్థి ఆయా శాస్త్రాలు నేర్చుకొనే సమయంలో సులభంగా కొత్త ఆలోచనలు వ్యక్తంచేసే కొత్తమాటలు వాడగలుగుతాడు. మాతృభాషలోని పదాలను వాడి సాంకేతిక పదాలను సృష్టించుకోగలుగుతాడు. అందువల్ల విజ్ఞానం అతనికి సులభంగా స్పష్టంగా పట్టుబడుతుంది. ఆలోచనలు స్పష్టంగా సాగుతాయి. ఫలితంలో సరికొత్త విషయాలను బాగా అర్థం చేసుకొని కనిపెట్ట గలుగుతాడు.

పైవాక్యాలను ఒకటి రెండు ఉదాహరణలు స్పష్టం చేస్తాయి. ఇంగ్లీషు మన మాతృభాష కాదు కాబట్టి ఆభాషలో శాస్త్రాలు నేర్చిన విద్యార్థి ఆ గ్రంథాల్లోని మాటలను చిలకపలుకుల్లాగా వల్లించగలడే గాని పూర్తిగా సులభంగా అర్థం చేసుకోలేడు. అందులోని సాంకేతికపదాల వెనక ఉన్న ఆలోచనలను స్పష్టంగా గ్రహించ లేడు. హిందీమాటలనో సంస్కృతపదాలనో వాడినా ఫలితం ఒక్కటే, ఎందుకంటే ఆ భాషలేవీ మన మాతృభాషలు కావు. మనం ఊహ వచ్చినప్పటినుంచీ వాడినవి కావు. వాటి అర్థాలు మనకు సరిగా తెలీదు. మచ్చుకు 'triangle' అన్నా, 'త్రికోణ' మన్నా మనకు కొత్త మాటలే. మూడు మూలలున్న గీతలని అంటే సులభంగా అర్థమవుతుంది. 'త్రి' అంటే మూడని వేరే ఎవ్వరూ చెప్పకుండానే 'మూడు' అనే మాట చిన్నప్పటి నుంచీ తెలుసు కాబట్టి తొందరగా అర్థం చేసుకోగలం. 'tri' – అనేది ఇంగ్లీషుమాట. 'త్రి' అనేది సంస్కృతపదం. వీటికన్నా మనకు బాగా తెలిసిన మాట 'మూడు'. 'మూడు' అనే మాటను వాడినందువల్ల మన శ్రమ తగ్గిందన్న మాట.

అయితే ఏవి అచ్చ తెలుగుమాటలో గుర్తించకతప్పదు. అందుకు ఈ నిఘంటువు తోడ్పడుతుంది. ఇందులో కనిపించే తెలుగుమాటలు మూడు రకాలు. ఒకటి: తల, కన్ను, చేయి వంటి ప్రాథమిక పదాలు. అవి మనభాష పుట్టినప్పటినుంచీ నేటిదాకా వాడుకలో ఉన్నవే. రెండు: ముక్కంటి తలపూవుసానికంబు

– వంటి సమాసాలు. ఇందులో మూడుకన్నులున్న దేవుణ్ని 'ముక్కంటి' అన్నారు ఈ మాట కొందరి వాడుకలోనైనా ఉంది. 'తలపూవు' అనే సమాసం ఇప్పటి వాడుకలో లేదుగాని 'తలమానికము' అనేది శ్రేష్ఠవాచకంగా ఉంది. ఈ మొత్తం సమాసం ఇప్పటివాడుకలో లేదు గాని తెలుగు కవుల వాడుకలో వుంది. మూడు: 'నెల' వంటి మాటకు 'చంద్రుడు' అనే అర్థం ఇప్పుడు విడిగా వాడుకలో లేదు. కానీ 'నెల తక్కువ వాడు, నెలవంక' మొదలైన మాటల్లో భాగంగా వాడుకలో ఉంది. అంటే మొదటి రకం అందరూ వాడే మాటలు: రెండో రకం కవులు తప్ప వాడనివి. మూడో రకం మారిన అర్థంతోనే, సమాసంలో భాగంగానో ఉన్నవి.

పైమూడురకాల మాటలూ బదులుమాట లున్నవే. అలాంటివిమాత్రమే ఈనిఘంటువులో ఉన్నాయి ఇది ఆలెక్కన చాలా చిన్న పుస్తకం. తెలుగుప్రజల వాడుకలో ఉన్న తెలుగు మాటలన్నీ తెలుసుకుందా మంటే ఇప్పటి పరిస్థితిలో సులభం కాదు. వాడుకలో ఉన్న మాటలన్నిటినీ పోగుచేసి, వాటికున్న రకరకాల అర్థాలన్నిటినీ చేర్చి మరో పెద్దనిఘంటువును తయారుచేస్తే గాని మనభాష ఎంత విస్తృత మయిందో తెలియదు. అందుకు ప్రయత్నాలు జరుగుతున్నాయి. 'అన్నప్రాశన నాడే ఆవకాయ' అన్నట్లు పెద్దనిఘంటువులను మొదటనే చదివి అన్ని విషయాలూ ఒకేసారి తెలుసుకోవటం సాధ్యం కాదు. అందువల్ల మొదట ఈ చిన్న నిఘంటువును నేర్చుకుంటే తరవాత పెద్ద వాటిని చదవవచ్చు.

ఈ నిఘంటువులో చేరని కొన్ని మాటలు 'ఆంధ్రనామశేషం'లో ఉన్నాయి వాటిని కూడా విద్యార్థు లకు అందిస్తున్నాం. పై తరగతిలో ఈ రెంటిలోనూ చేరని మాటలు నేర్పాలని ఆశిస్తున్నాం ఆ నిఘంటువు పేరు 'సాంబనిఘంటువు'. ఈ మూటినీ 'నిఘంటుత్రయ'మని పిలుస్తారు. వీటిని చదివినందువల్ల భాషలో మంచి పునాది ఏర్పడుతుంది. భాషమీద బాల్యంలోనే అభిమానం పుడ్తుంది.

ఈ నిఘంటువులోని మాటలను ఇప్పటిభాషలో ఇస్తున్నాం. ఆ మాటల అర్థాలను ఇస్తున్నాం. సమా సాలను విడమరచి చెప్తున్నాం. వీటి ద్వారా విద్యార్థుల్లో లేతవయస్సులోనే భాషాభిమానం పుడ్తుందని ఆశిస్తున్నాం.

– బూదరాజు రాధాకృష్ణ

దీనిలో ------

# సూచనలు

* ఈ గ్రంథం ప్రధానంగా ఆరోతరగతి విద్యార్థుల కోసం ఉద్దేశించింది.
* వారానికి ఒక పీరియడ్ చొప్పున ఆంధ్రనామసంగ్రహశేషాలకు కేటాయించి, ఆరోతరగతి పూర్తి అయ్యేలోపుగా విద్యార్థుల కందరకూ ఈ గ్రంథంలోని పద్యాలన్నీ కంఠస్థంగా వచ్చేట్టు చేయాలి.
* ఉపాధ్యాయులు ప్రతిపద్యంలోనూ ఏ మాటలు ఉన్నదీ, ఆ మాటలకు ఏయే పర్యాయపదాలు ఇచ్చిందీ పిల్లలకు వివరంగా చెప్పాలి.
* ఒక వర్గులోని పద్యాలు పిల్లలకు కంఠస్థం కాగానే ఒక పోటీ నిర్వహించి, మార్కులు వేసి, వివిధనామాల పర్యాయపదాలన్నీ సరిగా చెప్పిన జట్టు విద్యార్థులకు పారితోషికాలు ఇవ్వాలి.
* విద్యార్థులు పోటాపోటీలుగా ఈగ్రంథం కంఠస్థంచేస్తూ, ఈగ్రంథంలోని అంశాలను చర్చిస్తూ ఉండే వాతావరణం పాఠశాలలో కల్పించాలి.
* ఇంటివద్ద తల్లిదండ్రులుకూడా తగినంత శ్రద్ధతీసుకొని పిల్లలు స్పష్టమైన ఉచ్చారణతో పద్యాలు కంఠస్థం చేసేట్టు చూడాలి.



క. శ్రీపతివంద్యు విశాలా
క్షీపతిని భజించి యిష్ట*సిద్ధులు ఫలుసన్
బ్రాపింపఁగ గణనాథుని
శ్రీపాదంబులకు నెఱఁగి*చెందినవేడ్కన్.

విష్ణుమూర్తి నమస్సులందేవాడూ, 'విశాలాక్షి' భర్తా అయిన ఈశ్వరుణ్ణి ప్రార్థించి, ఈప్సితార్థాలు ఫలుసగా సిద్ధించడం కోసం విఘ్నేశ్వరుని శ్రీచరణాల మ్రోల నమస్కరించి –

క. నతభక్తలోకరక్షా
రతికిం జంచత్కృపాత*రంగితమతికిన్
శతమఖముఖసురనుతిసం
గతికిన్ మహిమోన్నతికిని*గాశీపతికిన్ 2

తనను కొలిచే భక్తజనులను రక్షించగోరేవాడూ, కృపారసం పొంగిపొరలే మనస్సు గలవాడూ, ఇంద్రుడు మొదలైన దేవతల చేత స్తుతింపబడేవాడూ, మహిమోపేతుడూ అయిన కాశీపతికి

తే. అంకిత మొనర్తుఁ దెనుఁగుపే*ళ్లరసి కూర్చి
గరిమతో నాంధ్ర నామసం*గ్రహ మనంగ
నమరుకృతిఁ బైడిపాటి యే*కామ్రమంత్రి
సుతుఁడఁ గవిలక్ష్మణాఖ్యుఁడ*సుజనహితుఁడ. 3

తెనుగు నామాలను సవిమర్శంగా కూర్చిన 'ఆంధ్రనామ సంగ్రహం' అనే ఈ కృతిని అంకితం చేస్తున్నాను; నేను పైడిపాటి ఏకామ్రనాథుని కుమారుణ్ణి; లక్ష్మణ కవిని; సుజన విధేయుణ్ణి.

తే. దేవమానవస్థావర*తిర్యగాఖ్య
వర్గు లొనరింతు నానార్థ*వర్గుఁ గూడ
వర్గములు గాఁగఁగూర్తు నా*హ్వాయములందు
నిడుదు వివరించునెడల సం*స్కృతపదంబు. 4

దేవవర్గు, మానవవర్గు, స్థావరవర్గు, తిర్యగ్వర్గు, నానార్థవర్గు – అనే అయిదు వర్గాలుగా తెలుగు నామాలను కూరుస్తాను. తెలుగుపదాలకు అర్థం సంస్కృత పదంతో వివరిస్తాను.

క. శ్రీలలనాధిపవంద్య! వి
శాలాక్షీప్రాణనాథ!*శతమఖముఖది
క్పాలాభీష్టద! సమధిక
శీలా! కాశీనివేశ!*శ్రీ విశ్వేశా! 5

లక్ష్మీదేవి భర్త అయిన విష్ణువు వందనాలు అందుకునేవాడా! విశాలాక్షి ప్రాణనాథుడా! ఇంద్రుడు మొదలైన దిక్పాలకులకు అభీష్టాలను సమకూర్చేవాడా! గొప్ప శీలసంపదగలవాడా! కాశీనివాసా! విశ్వేశ్వరా!

**సీ.** ముక్కంటి యరపది*మోముల వేలుపు
మినుసిగ దయ్యంబు*మిత్తిగొంగ
గట్టువిల్తుఁడు గఱ*కంఠుడు మిక్కిలి
కంటిదేవర బేసి*కంటివేల్పు
వలిమలల్లుడు మిన్ను*వాకతాలుపు కొండ
వీటిజంగము గుజ్జు*వేల్పుతండ్రి
వలరాజుసూడు జ*క్కులఱేని చెలికాడు
బూచుల యెకిమీఁడు*పునుకతాల్పు

**తే.** విసపుమేఁతరి జన్నంపు*వేఁటకాఁడు
బుడుత నెలతాల్పు వెలియాల*పోతు రౌతు
తోలుదాలుపు ముమ్మొన*వాలు దాల్పు
నాఁగ భవదాఖ్య లొప్పు (నం*ధక విపక్ష!) 6

**సీ.** సోఁకుమూఁకలగొంగ*చుట్టుఁగైదువుజోదు
పచ్చవిల్తునితండ్రి*లచ్చిమగఁడు
పులుఁగుతత్తడిరౌతు*వలమురితాలుపు
వెన్నుఁడు కఱివేల్పు*వెన్నదొంగ
నునుగాడ్పుదిండిపా*నుపునఁ బండెడుమేటి
బమ్మదేవరతండ్రి*తమ్మికంటి
పదివేసములసామి*పసిఁడిపుట్టముదాల్పు
కఱ్ఱినెచ్చెలి తరి*గట్టుదారి

**తే.** యాలకాపరి వ్రేఁతల*మేలువాఁడు
పాలకడలల్లుఁడును బక్కి*డాలుఱేఁడు
ఱేయుఁబవలును జేయుక*న్దోయివాఁడు
మామమా మన హరి యొప్పు*(శ్రీమహేశ!) 7



శివుడు



విష్ణువు

**శివుడు :** ముక్కంటి, అరపదిమోములవేలుపు, మినుసిగ దయ్యం, మిత్తిగొంగ, గట్టువిల్తుడు, కరకంఠుడు, మిక్కిలి కంటిదేవర, బేసికంటివేల్పు, వలిమలల్లుడు, మిన్నువాక తాలుపు, కొండవీటిజంగం, గుజ్జువేల్పుతండ్రి, వలరాజు సూడు, జక్కులరేనిచెలికాడు, బూచులయెకిమీడు, పునుక తాల్పు, విసపుమేతరి, జన్నంపువేటకాడు, బుడుతనెలతాల్పు, వెలిఆలపోతురౌతు, తోలుతాలుపు, ముమ్మొనవాలుతాలుపు,

**విష్ణువు :** సోకుమూకలగొంగ, చుట్టుకైదువుజోదు, పచ్చవిల్తుని తండ్రి, లచ్చిమగడు, పులుగుతత్తడిరౌతు, వలమురితాలుపు, వెన్నుడు, కరివేల్పు, వెన్నదొంగ, నునుగాడ్పుదిండిపానుపున పండెడుమేటి, బమ్మదేవరతండ్రి, తమ్మికంటి, పదివేసముల సామి, పసిడిపుట్టముతాలుపు, కర్రినెచ్చెలి, తరిగట్టుదారి, ఆలకాపరి, వ్రేతలమేలువాడు, పాలకడలల్లుడు, పక్కిడాలు రేడు, రేయుబవలునుజేయు కన్దోయివాడు, మామమామ (హరి)

తే. గట్లరాయనిపట్టి ము*క్కంటివెలఁది
యేనుఁగులగొంగతత్తడి*నెక్కుదంట
సామిసామేనిఁ జేకొన్న*చాన జగము
తల్లి యన గౌరిపేళ్లొప్పు*(ధర నుమేశ!) 9



బ్రహ్మ

సీ: పక్కిడాల్వేలుపు*పొక్కిలిపసిబిడ్డఁ
డంచతేజీనెక్కి*యాడురౌతు
మనెడుప్రొద్దులనొస*ళ్లను వ్రాయుదేవర
చదువులవేలుపు*జన్నిగట్టు
తెలిదమ్మిగద్దియఁ*గొలువుండురాయఁడు
నిక్కపుజగమేలు*నేర్పుకాఁడు
కడుపుబంగారుబొ*క్కసముఁ జేసినమేటి
పోరోగిరముతిండి*పోతుతండ్రి

ఆ. నలువ తమ్మిచూలి*నలుమొగంబులవేల్పు
వేల్పుఁబెద్ద పలుకు*వెలఁదిమగఁడు
తాత బమ్మ యన వి*ధాతనామములొప్పు
(నఘవినాశ! యీశ!*యభ్రకేశ!) 8

బ్రహ్మ : పక్కిడాలువేలుపుపొక్కిలిపసిబిడ్డడు, అంచతేజీనెక్కియాడురౌతు, మనెడుప్రొద్దులనొసళ్లనువ్రాయుదేవర, చదువులవేలుపు, జన్నిగట్టు, తెలిదమ్మిగద్దియకొలువుండురాయడు, నిక్కపుజగమేలునేర్పుకాడు, కడుపుబంగారుబొక్కసంచేసినమేటి, పోరోగిరముతిండిపోతుతండ్రి, నలువ, తమ్మిచూలి, నలుమొగములవేలుపు, వేలుపుపెద్ద, పలుకువెలదిమగడు, తాత, బమ్మ (విధాత)



పార్వతి

పార్వతి : గట్లరాయనిపట్టి, ముక్కంటివెలది, ఏనుగులగొంగతత్తడినెక్కుదంట, సామిసామేనిచేకొన్నచాన, జగముతల్లి (గౌరి)



లక్ష్మి

తే. లచ్చి కలుములజవరాలు*పచ్చవిల్తు
తల్లి కఱివేల్పునిల్లాలు* తల్లితల్లి
కడలికూఁతురు సిరి లిబ్బి*పడఁతి తమ్మి
యింటిగరి తన శ్రీయొప్పు*(మృగధరాంక!) 10

లక్ష్మి : లచ్చి, కలుములజవరాలు, పచ్చవిల్తునితల్లి, కరివేలుపుఇల్లాలు, తల్లితల్లి, కడలికూతురు, సిరి, లిబ్బిపడతి, తమ్మియింటిగరిత (శ్రీ)

క. తలవాఁకిటను మెలంగెడు
పొలఁతుక పలుకులవెలంది*పొత్తముముత్తో
నలువపడఁతి కలుములపై
దలికోడ లనంగఁ బరఁగు* (ధర) వాణి (శివా!) 11


సరస్వతి

సరస్వతి : తలవాకిటనుమెలగెడుపొలతుక. పలుకులవెలది. పొత్తముముత్తో (ముత్తైదువ), నలువపడతి. కలుములపైదలి కోడలు (వాణి)

సీ. ఇద్దరుతల్లుల*ముద్దుబిడ్డఁడు పని
చెఱుపులదొర చేట*చెవులవేల్పు
వంకరతొండంబు*వాఁ డేనుఁగుమొగంబు
దేవర పాఁపజం*దెములమేటి
మ్రొక్కువారలపనుల్*చక్కఁజేసెడుసామి
గఱికపూజల మెచ్చు*గబ్బివేల్పు
ముక్కంటిపండుల*మెక్కెడితిండీఁడు
ముక్కంటిగారాబు*ముద్దుపట్టి

ఆ. పెద్దకడుపువేల్పు*పిళ్లారి కుడుముల
తిండికాఁడు కొక్కు*తేజిరౌతు
గుజ్జువేలు పొంటి*కొమ్ముదేవర వెన
కయ్య యన వినాయ*కాఖ్య (లీశ!) 12


వినాయకుడు

వినాయకుడు : ఇద్దరుతల్లులముద్దుబిడ్డడు, పనిచెరుపులదొర, చేటచెవులవేలుపు, వంకరతొండంవాడు, ఏనుగుమొగందేవుడు, పాపజందెములమేటి, మొక్కువారలపనులుచక్కచేసేసామి గరికపూజలమెచ్చు గబ్బివేలుపు, ముక్కంటిపండులమెక్కెడు తిండీడు, ముక్కంటిగారాబుముద్దుపట్టి, పెద్దకడుపువేలుపు, పిళ్ళారి, కుడుములతిండికాడు,కొక్కుతేజిరౌతు, గుజ్జువేలుపు, ఒంటికొమ్ముదేవర, వెనకయ్య.

సీ. పెనుఁబాఁపకవణంబుఁ*దినువారువమురౌతు
గట్టులయెకిమీని*పట్టిపట్టి
ఱెల్లుచూ లార్గురు*తల్లులకొమరుండు
గాడుపుసంగడి*కానికొడుకు
పుంజుదాలుపు వేలు*పులఱేనిదళవాయి
జంటముమ్మోముల*దంటవేల్పు
కొంచగుబ్బలిప్రక్క*లించినబలుదిట్ట
రెండాఱుచేతుల*దండిమగఁడు

తే. వేలుపులమూఁక పేరిటి*వెలఁదిమగఁడు
వేల్పుగమికాఁడు వెనకయ్య*వెనుకవాఁడు
కొమరుసామన సేనాని*కొమరుమిగులు
(విగతభవపాశ! కాశినీ*వేశ! యీశ!) 13



కుమార స్వామి

కుమారస్వామి : పెనుపాపకవణంతినువారువంగౌతు, గట్టులయెకిమీనిపట్టిపట్టి, రెల్లుచూలు, ఆరుగురుతల్లులకొమరుడు, గాడుపుసంగడికానికొడుకు, పుంజుతాలుపు, వేలుపులరేనిదళవాయి, జంటముమ్మోములదంటవేలుపు, కొంచగుబ్బలిగ్రక్కలించినబలుదిట్ట, రెండారుచేతులదండిమగడు, వేలుపులమూకపేరిటి వెలదిమగడు, వేలుపుగమికాడు, వెనకయ్యవెనుకవాడు, కొమరుసామి (సేనాని)

సీ. అలరువిల్తుండు క*న్నులవిల్తుఁడును గమ్మ
విలుకాఁడు చక్కెర*వింటివాఁడు
చెఱకువిల్కాఁడు కెం*జిగురులవిల్తుఁడు
వెడవిల్తుఁడును బచ్చ*విల్తుఁ డించు
విల్లుదాలుపు తుంట*విలుకాఁడు తియ్యవి
ల్కాఁడును జమిలిము*క్కాలినారి
విలుకాఁడు చౌవంచ*ములుకులుగలదంట
రాచిల్కనెక్కెడు*రాయరౌతు

తే. మీనుమొసలిసిడంబుల*మేటి చంద
మామయల్లుఁడు వలరాజు*మరుఁడు లచ్చి
కొమరుఁడను పేళ్ల నొప్పును*గుసుమధన్వి
(విగతభవపాశ! కాశీని*వేశ! యీశ!) 14

మన్మథుడు : అలరువిల్తుడు, కన్నులవిల్తుడు, కమ్మవిలుకాడు, చక్కెరవింటివాడు, చెరకువిలుకాడు, కెంజిగురులవిల్తుడు, వెడవిల్తుడు, పచ్చవిల్తుడు, ఇంచువిల్లుతాలుపు, తుంటవిలుకాడు, తియ్యవిల్కాడు, జమిలిముక్కాలినారివిలుకాడు, చౌవంచములుకులుగలదంట, రాచిలుకఎక్కెడుధాయరౌతు, మీనుమొసలిసిడములమేటి, చందమామ యల్లుడు, వలరాజు, మరుడు, లచ్చికొమరుడు (కుసుమధన్వి)



మన్మథుడు



చంద్రుడు

**సీ.** చలువలఱేఁడు వె*న్నెలఱేఁడు రేఱేఁడు
జాబిల్లి రేవెల్గు*చందమామ
తమ్ములపగవాఁడు*కమ్మవిల్తునిమామ
కలువలఱేఁడు పా*ల్కడలిపట్టి
జక్కవకవవిప్పు*ముక్కంటితలపువ్వు
చుక్కలదొర ప్రొద్దు*జోడుకోడె
తపసికన్నాప బి*త్తరిజింకతాలుపు
కఱివేల్పుడాకన్ను*కడలివెన్న

**తే.** పంటపైరులయెకిమీఁడు*జంటదంట
చౌకములపాళ్ల తెలిముద్ద*చలివెలుంగు
వేలుపులబువ్వ చీఁకటి*వేరువిత్తు
నెల యనఁగఁ జంద్రుపే ళ్లొప్పు (నీలకంఠ!) 15

**చంద్రుడు :** చలువలరేడు, వెన్నెలరేడు, రేరేడు, జాబిల్లి, రేవెలుగు, చందమామ, తమ్ములపగవాడు, కమ్మవిల్తునిమామ, కలువలరేడు, పాల్కడలిపట్టి, జక్కవకవవిప్పు. ముక్కంటితలపువ్వు, చుక్కలదొర, ప్రొద్దుజోడుకోడె, తపసికన్నుపాప, చిత్తరిజింకతాలుపు, కరివేలుపుడాకన్ను, కడలివెన్న, పంటపైరులఎకిమీడు, జంటదంటచౌకములపాళ్ళతెలిముద్ద, చలివెలుగు, వేలుపుల బువ్వ, చీకటివేరువిత్తు, నెల.



సూర్యుడు

**సీ.** వెన్నునివలకన్ను*వేఁడివేలుపు ప్రొద్దు
తొవలరాయిడికాఁడు*పవలుసేయు
వేలుపు పచ్చగు*ఱ్ఱాలవజీరుండు
వేఁడివెలుంగు రే*వెల్గుజోడు
జంటాఱుమేనుల*సామి చీఁకటిగొంగ
యెఱ్ఱనివేలుపు*నివముసూడు
చదలుమానికము ప్రాఁ*జదువుల పెట్టియ
యేడుగుఱ్ఱముల తే*రెక్కుజోదు
ముమ్వేలుపులయిక్క*మ్రొక్కులదేవర
గాములఱేఁడు జ*క్కవలఱేఁడు
వేయి చేతులఱేఁడు*వెలుఁగులయెకిమీఁడు
చయ్యులసాకిరి*చాయమగఁడు

**తే.** మింటి తెరువరి తమ్మివా*ల్గంటిమగఁడు
పోరనీల్గెడుమొనగాండ్రు*పోవుదారి
జగముచుట్టంబు జమునయ్య*జగముకన్ను
నాఁగ సూర్యునిపే ళ్లొప్పు*(నాగభూష!) 16

**సూర్యుడు :** వెన్నునివలకన్ను, వేడివేలుపు, ప్రొద్దు, తొవలరాయిడికాడు, పవలుసేయువేలుపు, పచ్చగుర్రాలవజీరుడు, వేడివెలుగు, రేవెలుగుజోడు, జంటారుమేనులసామి, చీకటిగొంగ, ఎర్రనివేలుపు, ఇవముసూడు, చదలుమానికం, ప్రాజదువులపెట్టియ, ఏడుగుర్రములతేరెక్కుజోదు, ముమ్వేలుపులయిక్క, మొక్కులదేవర, గాములరేడు, జక్కవలరేడు, వేయిచేతులరేడు, వెలుగులఎకిమీడు, చయ్యులసాకిరి, చాయమగడు, మింటితెరువరి, తమ్మివాల్గంటిమగడు, పోరనీల్గెడుమొనగాళ్లుపోవుదారి, జగముచుట్టం, జముని అయ్యా, జగము కన్ను.

**సీ.** చట్టుపల్దెగగట్టఁ*గొట్టెడుజెట్టి నూ
ఱంచులవాలు చే*మించుజోదు
దుగబొట్లపిఱిఁది యై*దుకనుంగవలవేల్పు
పాఱుతపసియింటి*పంచకోడి
యొడలిచూపొడయఁడె*క్కుడుమొగుల్గలప్రోడ
నిక్కువీనులజక్కి*నెక్కురౌతు
తెల్లయేనుఁగు నెక్కి*తిరిగెడుదొర తూర్పు
మాగానియేలెడు *మణియకాఁడు

**తే.** జమిలిచౌవంచపదులు జ*న్నములు సేసి
నట్టివేలుపు సోమాసి*పెట్టుఁజెట్టు
పొట్టితమ్ముఁడు గల్గిన*యట్టివేల్పు
నాఁగ నింద్రునిపేళ్లొప్పు*(నాగభూష!) 17



ఇంద్రుడు

**ఇంద్రుడు :** చట్టుపల్‌దెగగట్లకొట్టిడుజెట్టి, నూరంచులవాలు చేమించుజోదు, దుగబొట్లపిరిదిఅయిదుకనుగవలవేలుపు, పారుతపసిఇంటిపంచకోడి, ఒడలిచూపొడయడు, ఎక్కుడు మొగుల్‌గలప్రోడ, నిక్కువీనులజక్కినెక్కురౌతు, తెల్ల యేనుగునెక్కితిరుగుదొర, తూర్పుమాగానిఏలెడుమణియ కాడు, జమిలిచౌవంచపదులుజన్నములుచేసినట్టివేలుపు, సోమాసిపెట్టుచెట్టు, పొట్టితమ్ముడుకల్గినయట్టివేలుపు.

**ఆ.** నీరుపాప గాలి*నెచ్చెలి యన్నింటి
తిండికాఁడు కప్పుఁ*దెరువుజాడ
యంటరానివేల్పు*జంటమోములసామి
యగ్గి యనఁగ నొప్పు*ననలుఁ (డీశ !) **18**



అగ్ని దేవుడు

**అగ్ని :** నీరుపాప, గాలినెచ్చెలి, అన్నింటితిండికాడు, కప్పు తెరువుజాడ, అంటరానివేలుపు, జంటమోములసామి, అగ్గి (అనలుడు)

**తే.** జమునసైదోడు పెతరుల*సామి జముఁడు
ప్రొద్దుకొమరుఁడు గుదెతాల్పు*పోతుజక్కి
నెక్కియాడెడుబలురౌతు*దక్కిణంపు
సామి యన నంతకుం డొప్పు*(శ్రీమహేశ !) 19



యముడు

**యముడు :** జమునసైదోడు, పెతరులసామి, జముడు, ప్రొద్దుకొమరుడు, గుదెతాలుపు, పోతుజక్కినెక్కియాడెడు బలురౌతు, దక్కిణపుసామి (అంతకుడు)

**ఆ.** మూలఱేఁడు సోఁకు*మూఁకలఱేఁడు రే
ద్రిమ్మరీఁడు పొలసు*దిండిపోతు
రక్కసుండు నల్ల*ద్రావువాఁ డనఁగను
నిరృతిపేళ్లు సెల్లు*(నీలకంఠ !) **20**

**నిరృతి :** మూలరేడు, సోకుమూకలరేడు, రేద్రిమ్మరీడు, పొలసు తిండిపోతు, రక్కసుడు, నల్లతాగువాడు.



వరుణుడు

**ఆ.** మేటినీరుచూలి*మెయితాలుపులసామి
వల్లెత్రాడుదాల్పు*నీళ్ల రాయఁ
డేటిబోఁటిమగల*యెకిమీఁడు పడమటి
దొర యనంగ నొప్పు*వరుణుఁ (డీశ !) **21**

**వరుణుడు :** మేటినీరుచూలిమెయితాలపులసామి, వల్లె తాడుతాలుపు, నీళ్ళరాయడు, ఏటిబోటిమగలఎకిమీడు, పడమటిదొర.

సీ. వడిగలజింకతత్తడి నెక్కునెఱరౌతు
మేటిపాములమేఁత*నీటితాత
యొడలితాల్పులపిండు*కుసు రగుబలియుండు
సోఁకుదయ్యము మింటి*చూలి గాలి
కరువలి తెమ్మెర*గాడ్పు పయ్యర యొంటి
మ్రాకులపెనుముప్పు*మబ్బువిప్పు
సురటివీవులఁబుట్టు*సుడిగొట్టు చలినట్టు
బక్కవారలపెను*బాద యీఁద

తే. అబ్బురపుఁదియ్యవిలుకాని*నిబ్బరంపు
దెబ్బపోరుల నలయిక*ప్రబ్బుబోంట్ల
గబ్బిగుబ్బల చెమటల*యుబ్బడంచు
గబ్బినాఁ జను మారుతా*ఖ్యలు (మహేశ!) 22

గాలి : వడిగలజింకతత్తడినెక్కునెరరౌతు, మేటిపాముల మేత, నీటితాత. ఒడలితాలుపులపిండుకుసురగుబలియుడు, సోకుదయ్యం, మింటిచూలి, కరువలి, తెమ్మెర, గాడుపు, పయ్యర, ఒంటిమాకులపెనుముప్పు. మబ్బువిప్పు, సురటి వీవులపుట్టు, సుడిగొట్టు, చలినట్టు, బక్కవారలపెనుబాద, ఈద, అబ్బురపుతియ్యవిలుకానినిబ్బరంపుదెబ్బపోరుల అలయికప్రబ్బుబోంట్లగబ్బిగుబ్బలచెమటల ఉబ్బడచు గబ్బి (మారుతం)

క. మరుదాఖ్య లొప్పుచుండును
ధర వినుచూలి యన సోఁకు*దయ్య ఘనం బ
య్యెర యన గొట్టన నీఁ దనఁ
గరువలి యనఁ దెమ్మె రనఁగ*గాలి యనంగన్ 23




గాలి : వినుచూలి, సోకుదయ్యం, పయ్యెర గొట్టు. ఈద, కరువలి, తెమ్మెర (మరుత్తు)

క. ముక్కంటియనుఁగుఁజెలి వడ
చక్కెలిక చాగకాఁడు*జక్కులదొర బల్
రొక్కమెకిమీఁడు మానిసి
నెక్కెడువాఁ డనఁగ జను ధ*నేశుం (డభవా!) 24


కుబేరుడు

కుబేరుడు : ముక్కంటిఅనుగుచెలి, వడచక్కెలిక, చాగ కాడు, జక్కులదొర, పలురొక్కమెకిమీడు, మానిసినెక్కు వాడు (ధనేశుడు)

క. విడిముడి గలవేలుపుచెలి
జడముడిజంగంబు గడదె*సం గాపరియౌ
యొడయఁడు పాఁపతొడవుల
నిడియెడివే ల్పనఁగ నొప్పు*నీశానుఁ డిలన్. 25



శివుడు : విడిముడిగలవేలుపుచెలి, జడముడిజంగం, కడదెస కాపరియౌ - యొడయడు, పాపతొడవులనిడియెడువేలుపు (ఈశానుడు)

క. దేవాలయాహ్వయంబులు
కోవెల యన దేవళంబు*గుడి నా వెలయున్
దేవళ్లన జేజేలనఁ
గా వేలుపు లనఁగ వెలయుఁ*గ్రతుభుగభిఖ్యల్.
26


దేవాలయం

దేవాలయం : కోవెల, దేవళం, గుడి

దేవుళ్లు : దేవళ్లు, జేజేలు, వేలుపులు (క్రతుభుక్కులు)


గరుత్మంతుడు

గరుత్మంతుడు : మరునయ్యతేజి, పులుగులదొర, పాముల వేటకాడు, తూరుపునాడుఏలుదొరబువ్వగొన్నలావరి, గరుటామంతుడు (గరుడుడు)

ఆ. క్షితినిఁబేళ్లు దనరు*సిద్రంపుఁబెద్ద బల్
పాఁపఱేఁడు వెన్ను*పాను పనఁగఁ
బుడమితాలు పనఁగఁ*దడవులనిడుపఁడు
చిలువఱేఁ డనంగ*శేషునకును.
27


ఆదిశేషుడు

ఆదిశేషుడు : సిద్రపుపెద్ద, బలుపాపరేడు, వెన్నుపానుపు పుడమితాలుపు, తడవులనిడుపడు. చిలువరేడు (శేషుడు)

ఆ. నల్లవలువతాల్పు*తెల్లనిమైదంట
వెన్నదొంగయన్న*వెఱ్ఱినీళ్ల
మేలువాఁడు దుక్కి*వాలుదాలుపు తాటి
పడగవాఁ డనంగ*బలుఁడు (రుద్ర !)
29


బలరాముడు

బలరాముడు : నల్లవలువతాలుపు, తెల్లనిమైదంట, వెన్నదొంగఅన్న, వెర్రినీళ్లమేలువాడు, దుక్కివాలుతాలుపు, తాటిపడగవాడు (బలుడు)

క. మరునయ్యతేజి పులుఁగుల
దొర పాములవేఁటకాఁడు*తూరుపునాఁడేల్
దొరబువ్వఁ గొన్నలావరి
గరుటామంతుఁ డన నొప్పు*గరుడుం (డభవా!)
28

క. వడముడి యనఁగా గాడుపు
కొడు కన నివి రెండుబేళ్ల*గున్ భీమునకుం
బుడమిం గట్టి యనం గ
వ్వడి యన వివ్వచ్చుఁ డనఁగ*వాసవి (యీశా!) 30


అర్జునుడు

భీముడు : వడముడి, గాడుపుకొడుకు.

అర్జునుడు : క్రి, కవ్వడి, వివ్వచ్చుడు (వాసవి)

తే. వేలుపులత్రోవ యుప్పర*వీది యాక
సంబు విను విన్ను మిను మిన్ను*చదలు నింగి
దివి మొయిలుదారి చుక్కల*తెరువు బయలు
గాడ్పుతం డ్రన నభమొప్పు*(గరళకంఠ!) 31




ఆకాశం : వేలుపులతోవ, ఉప్పరవీది, ఆకసం, విను, విన్ను మిను, మిన్ను, చదలు, నింగి, దివి, మొయిలుదారి, చుక్కల తెరువు, బయలు, గాడుపుతండ్రి (నభం)

తే. వెలయు ధరణిఁ జతుర్దిశల్*నలుఁగడ లన
నలరు దచ్చికడ లన ది*శాష్టకంబు
దనరు నీరైదుకడలు నా*దశదిశలును
(మౌళిధృతగంగ! యంగజ*మదవిభంగ!) 32

నాలుగుదిక్కులు : నలుగడలు (చతుర్దిశలు)

ఎనిమిదిదిక్కులు : దచ్చికడలు (అష్టదిశలు)

పదిదిక్కులు : ఈరైదుకడలు (దశదిశలు)

ఆ. తాటిసిడమువాని*తల్లి కూఁతురిబిడ్డ
వెన్నునడుగుపాప*మిన్నువాఁక
వేల్పుటేఱు గడలి*వెలఁదుక ముత్రోవ
ద్రిమ్మ రనఁగ నొప్పు*(దివిజగంగ!) 33


గంగానది

గంగానది : తాటిసిడమువానితల్లి, కూతురిబిడ్డ, వెన్నుని అడుగుపాప, మిన్నువాక, వేలుపుటేరు, కడలివెలదుక, ముత్రోవద్రిమ్మరి (దివిజ గంగ)

**తే.** వేలుపులగౌరు చౌదంతి*వెల్లయేనుఁ
గనఁగ నైరావతంబున*కాఖ్య లమరు
వేల్పుదొరతేజి యనఁగను*వెల్లగుఱ్ఱ
మనఁగ నుచ్చైశ్శ్రవం బొప్పు*(నంబికేశ!) 34





ఐరావతం : వేలుపులగౌరు, చౌదంతి వెల్లఏనుగు

తెల్ల గుఱ్ఱం : వేలుపుదొర తేజి, వెల్లగుఱ్ఱం (ఉచ్చైశ్శ్రవం)

**ఆ.** పుడుకుఁదొడుకు వేలు*పులగిడ్డి వెలిమొద
వనఁగఁ గామధేను*వలరుచుండుఁ
గల్పకంబు దనరు*వేల్పుఁజెట్టీవుల
మ్రాను వెల్లమ్రాను*నా (నుమేశ!) 35



కామధేనువు



కామధేనువు : పుడుకుతొడుకు, వేలుపులగిడ్డి, వెలిమొదవు

కల్పవృక్షం : వేలుపుచెట్టు, ఈవులమ్రాను, వెల్లమ్రాను.

**ఆ.** అవని గుడుసుకైదు*వనఁగ వేయంచుల
కైదు వనఁగఁ జుట్టు*గైదు వనఁగ
బటువుఁగైదు వనఁగఁ*బరఁగు సుదర్శన
చక్రమునకుఁ బేళ్లు*(చంద్రమౌళి!) 36



చక్రం

సుదర్శనచక్రం : గుడుసుకైదువు! వేయంచులకైదువు, చుట్టుకైదు, బటువుకైదువు

**ఆ.** వలమురి యనఁ జుట్టు*వాలుజోడనఁ గల్మి
కొమ్మమగనిబూర*గొమ్మనంగఁ
దనరుఁ బాంచజన్య*మునకు నభిఖ్యలు
(ధృతకురంగ! ధవళ*వృషతురంగ!) 37



శంఖం

**శంఖం :** వలమురి, చుట్టువాలుజోడు. కల్మికొమ్మమగని బూరకొమ్ము (పాంచజన్యం)

**తే.** రిక్క లనఁ జుక్క లనఁగను*ఋక్షములకు
నాఖ్య లై యొప్పుఁ దెఱఁగంటి*యన్ను లనఁగ
నచ్చర లనంగ వేలుపు*మచ్చకంటు
లనఁగ సురకాంతలకు నాఖ్య*లగు (గిరీశ!) **38**




నక్షత్రాలు : రిక్కలు, చుక్కలు (ఋక్షములు)

దేవకాంతలు : తెరగంటిఅన్నులు అచ్చరలు. వేల్పుమచ్చకంటులు (సురకాంతలు)

**తే.** పవలు పగ లనఁ బే ళ్లొప్పు*దివమునకును
రాత్రిపేళ్లొప్పు రే రేయి*రాతి రనఁగ
వెలయుచుండును రేయెండ*వెన్నె లనఁగఁ
జంద్రికకును సమాఖ్యలు*చంద్రమౌళి!) **39**










పగలు : పవలు (దివము)'

రాత్రి : రే, రేయి, రాతిరి, వెన్నెల : రేయెండ (చంద్రిక)

**క.** మించు లన మెఱుపు లనఁగను
జంచలలకుఁ బేళ్లు దనరు*జలధరములు రా
ణించుం బలుకంగ మొయి
ళ్లంచు మొగుళ్లంబు మబ్బు*లంచున్ (భర్గా!)
**40**




మెరుపులు : మించులు (చంచలలు)

మేఘం : మొయిలు, మొగులు, మబ్బు (జలధరం)

**క.** తొలుచదువులు ప్రాఁజదువులు
దొలుమినుకులు ప్రామినుకులు*దొలుపలుకులు ప్రాఁ
బలుకులు పెనుమినుకులు నా
వెలయున్ శ్రుతులకును బేళ్లు*(విశ్వాధిపతీ!) **41**




వేదాలు : తొలుచదువులు, పాతచదువులు, తొలుమినుకులు, పాతమినుకులు, తొలుపలుకులు, పాతపలుకులు పెనుమినుకులు (శ్రుతులు)

**క.** ఇది దేవవర్గు దీనిం
జదివిన వ్రాసినను వినిన*జనులకు నిత్యా
భ్యుదయంబు లొసఁగుచుండును
వదలక కాశీనివాస*వాసుఁడు పేర్మిన్. **42**

**తే.** పాఱుఁ డనఁగఁ బుడమివేల్పు*బాఁపఁ డనఁగ
జన్నిగ ట్టన విప్రుండు*జగతిఁ బరఁగు
నొడయఁ డేలిక యెకిమీఁడు*పుడమిఱేఁడు
ఱేడు దొర సామి యన నొప్పు*నృపతిపేళ్లు 1




**బ్రాహ్మణుడు :** పారుడు, పుడమివేల్పు, బాపడు, జన్నికట్టు (విప్రుడు)

**క్షత్రియుడు :** ఒడయడు, ఏలిక, ఎకిమీడు, పుడమిరేడు, రేడు, సామి, దొర (నృపతి)

**సీ.** కోమట్లు మూఁడవ*కొలమువాండ్రన బేరు
లన వైశ్యనామము*ల్దనరుఁ గాఁపు
వాండ్రు నా నాలవ*వాండ్రు నా బలిజెవాం
డ్రనఁ జను శూద్రస*మాహ్వయములు
వడుగు నా గోఁచిబాఁ*పఁడు నాఁగ బ్రహ్మచా
రికిఁ బేళ్లు నడచు ధ*రిత్రియందు
నాలుబిడ్డలు గల*యతఁ డిలుఱేడు గే
స్తన నొప్పుఁ బేళ్లు గృ*హాధిపతికి

**ఆ.** నడవిమనికిపట్లు*జడదారి యన వన
వాసి యొప్పు నిల్లు*వాసితిరుగు
బోడ తపసి కావి*పుట్టగోఁచులసామి
యన యతీంద్రుఁ డలరు*(నలికనేత్ర !)




2 కోమట్లు : మూడవకొలమువారు, బేరులు (వైశ్యులు)

కాపువారు : నాలవవారు, బలిజెవారు (శూద్రులు)

బ్రహ్మచారి : వడుగు, గోచిబాపడు

గృహస్థు : ఆలుబిడ్డలుగలవాడు, ఇలురేడు, గేస్తు (గృహాధిపతి)

వనవాసి : అడవిమనికిపట్లు, జడదారి. (వానప్రస్థుడు)

సన్యాసి : ఇల్లువాసితిరుగు (వాడు), బోడ, తపసి, కావి, పుట్టగోచులసామి (యతీంద్రుడు)







**సీ.** అమ్మ నాఁ దల్లి నా*నవ్వ నాఁ గన్నది
యన మాతృకాఖ్యలౌ*(నభ్రకేశ !)
అబ్బ నాయన యయ్య*యనఁ దండ్రి యన నప్ప
యన జనకాఖ్య లౌ*(నగనివేశ!)
తోడఁబు ట్టనఁగ సైదోడు తోఁబు ట్టన
సోదరాహ్వయము లౌ*(నాదిదేవ!)
భర్తృసహోదరు*భార్యకుఁ దోడికో
డ లన నేరా లన*నలరు (నభవ!)

**తే.** చెలియ లనఁ జెల్లె లనఁగను*వెలయుచుండు
నాహ్వయములు కనిష్ఠక*న్యకు (గిరీశ!)
జ్యేష్ఠకన్యకు నాఖ్యలై*క్షితిని వెలయు
నప్ప యన నక్క యనఁగ (జం*ద్రార్ధమకుట!) 3
















**అమ్మ :** తల్లి, అవ్వ, కన్నది **మాతృక,**
**నాన్న :** అబ్బ, నాయన, అయ్య, తండ్రి, అప్ప (జనకుడు)
**అన్న/తమ్ముడు** తోడబుట్టు, పైదోడు, తోబుట్టు (సోదరుడు)
**తొడి కోడలు :** ఏరాలు, (భర్తసహోదరునిభార్య)
**చెల్లెలు,** చెలియలు, చెల్లెలు (కనిష్ఠకన్య)
**అక్క** అప్ప, అక్క (జ్యేష్ఠకన్య)

సీ. ముగ్ధకుఁ బేళ్లగు*ముగుద యనన్ ముద్ద
రాలు నా గోల నా*బేల యనఁగ
గట్టివాయి యనంగ*గయ్యాళి యన ఱాఁగ
యన ధూర్తసతికి*నాహ్వయము లమరు
నైదువ నాఁగ ము*త్తైదువ నా నయి
దువరాలు నాఁ బుణ్య*యువతి వెలయు
మృతచిరంటికి నాఖ్య*లెసఁగుఁ బేరంటాలు
నాఁగను జక్కని*నా ధరిత్రి

**తే.** గేస్తురా లనునాఖ్యచే*గృహిణి వెలయు
నాలు పెండ్లాము రాణి*యిల్లా లనంగ
భార్య దనరును దొత్తన*బానిసె యన
వరవు డన దాసికాఖ్య లౌ*(గరళకంఠ!) 4




**అమాయిక :** ముగుద, ముద్దరాలు, గోల, బేల (ముగ్ధ)
**గయ్యాళి :** గట్టివాయి, రాగ (ధూర్తసతి)
**ముత్తైదువ :** అయిదువ, అయిదువరాలు , (పుణ్యయువతి)
**చనిపోయిన సుమంగళి :** పేరంటాలు జక్కని, (మృతచిరంటి)
**భార్య :** గేస్తురాలు, ఆలు, పెండ్లాము, రాణి, ఇల్లాలు.
దాసి : తొత్తు, బానిసె, వరవుడు.

సీ. కన్నియ కన్నె నాఁ*గన్యకుఁ బేళ్లొప్పు
జవరాలు కొమరాలు*జవ్వని యనఁ
దనరు యువతి ప్రౌఢ*యన గట్టివయసుది
యనఁ బ్రౌఢ దాల్చునీ*యాహ్వయములు
ముసలి మిండలకోర*ముప్పదియాఱేండ్లు
చనినది యనుపేళ్ల*నెనయు లోల
ముసలిది ముదుసలి*ముదియ పెద్దన నివి
యాఖ్య లై తనరు వృ*ద్ధాంగనకును

ఆ. చెడిప ఱంకులాడి*చెడ్డతొయ్యాలి వెలి
చవులుగనిన దనఁగ*జార దనరు
నిలను విటులదూత*యెడకాఁడు కుంటెన
కాఁ డనంగఁ దనరుఁ*(గరళకంఠ!) 5


వృద్ధురాలు

కన్య : కన్నియ, కన్నె.
**జవరాలు :** కొమరాలు, జవ్వని (యువతి)
ప్రౌఢ : ప్రౌఢ, గట్టి వయసుది
ముసలి : మిండలకోర, ముప్పదియారేండ్లు చనినది (లోల)
వృద్ధురాలు : ముసలిది, ముదుసలి, ముదియ, పెద్ద, **వృద్ధాంగన.**
రంకులాడి : చెడిపె, చెడ్డతొయ్యాలి, వెలిచవులుగనినది, (జార)
**విటుల దూత :** ఎడకాడు, కుంటెనకాడు.


కన్య.


జవరాలు.


ప్రౌఢ


ముసలి.

తే. వెల్పుబానిస వెలయాలు*వేడ్కకత్తె
లంజె బోగముచాన వె*ల్లాటకత్తె
పడపుఁజెలి యాటచేడియ*గడనకత్తె
నాఁగ నివి వేశ్య కాఖ్యలౌ*(నగనివేశ) 6

**వేశ్య :** వేల్పుబానిస, వెలయాలు, **వేడ్కకత్తె,**, లంజె, బోగంచాన, వెల్లాటకత్తె, పడపుఁజెలి, ఆటచేడియ; గడనకత్తె

ఆ. వెచ్చకాఁడు బొజఁగు*వేడుకకాఁడు మిం
డండు ననుపుకాఁడు*మిండగీఁడు
లంజెకాఁడు నా ధ*రం జనుఁ బల్లవ
నామధేయములు (పి*నాకహస్త!) 7

**విటుడు :** వెచ్చకాడు, బొజుగు, వేడుకకాడు, మిండడు, ననుపుకాడు, మిండగీడు, లంజెకాడు (పల్లవుడు)

ఆ. కోడెకాఁ డనంగ*గోవాళ్లు నాఁగను
యువజనాఖ్య లొప్పు*చుండు రెండు
నాగవాస మనఁగ*నామ మౌ వేశ్యాజ
నంబు మేళమునకు*(నంబికేశ!) 8

**యువజనుడు :** కోడెకాడు, గోవాళ్లు.
**బోగంమేళం :** నాగవాసం (వేశ్యాజనమేళం)

సీ. నెలఁతుక క్రాల్గంటి*పొలఁతుక ముద్దియ
వాలుఁగంటి మగువ*పడతి మడఁతి
చెలి మచ్చెకంటి యు*గ్మలి యింతి తొయ్యలి
నవలా కలువకంటి*నాతి గోతి
పూఁబోఁడి చిగురాకుఁ*బోఁడి పైదలి మించు
బోఁడి ముద్దులగుమ్మ*పొలఁతి కొమ్మ
ప్రోయా లువిద తీఁగె*బోఁడి చేడియ యించు
బోఁడి యన్ను వెలంది*బోటి జోటి

తే. చాన తెఱవ వెలందుక*చామ లేమ
చెలువ యెలనాగ చిలుకల*కొలికి కలికి
తలిరుఁబోఁడి యలరుఁబోఁడి*నెలఁత పొల్తి
గరిత యతివ నాస్త్రీసమా*ఖ్యలు (మహేశ!) 9



స్త్రీ

స్త్రీ : నెలతుక, క్రాల్గంటి, పొలతుక, ముద్దియ, వాలుగంటి , మగువ, పడతి, మడతి, చెలి, మచ్చెకంటి, **యుగ్మలి**, ఇంతి, తొయ్యలి, నవలా, కలువకంటి, నాతి, గోతి, పూబోడి, చిగురాకుబోడి, పైదలి, మించుబోడి, ముద్దులగుమ్మ, పొలతి, కొమ్మ, ప్రోయాలు , ఉవిద, తీగెబోడి, చేడియ, ఇంచుబోడి, అన్ను, వెలది, బోటి, జోటి, చాన, తెరవ, వెలందుక, చామ, లేమ, చెలువ, ఎలనాగ, చిలుకలకొలికి, కలికి, తలిరుబోడి, అలరుబోడి, నెలత, పొలతి, గరిత, అతివ.

తె. చెలిమి నేస్తంబు పొందు నా*స్నేహ మలరు
నెచ్చెలి యనుంగు సంగాతి*నేస్తకాఁడు
సంగడీఁ డనఁ జెలికాఁ డ*నంగఁ దనరు
స్నేహితునకు సమాఖ్యలు*(శ్రీమహేశ!) 10



స్నేహితుడు

స్నేహం : చెలిమి, నేస్తం, పొందు.

స్నేహితుడు : నెచ్చెలి, అనుంగు, సంగాతి, నేస్తకాడు, సంగడీడు, చెలికాడు



దొంగ

సీ. దొంగ తెక్కలికాఁడు*దొరకోలుసన్నాసి
ము చ్చెత్తుబరికాఁడు*ముడియవిడుపు
తెరువాటుకాఁడు క*త్తెరదొంగ చేవాఁడి
కాఁడు వల్లడికాఁడు*కన్నగాఁడు
మునిముచ్చు గడిదొంగ*యనఁ దస్కరాఖ్యలౌఁ
జెండిపోతు గరాసు*మొండికట్టె
టకటొంకు టాటోటు*టక్కులాఁడు పిసాళి
టక్కరి ముడికాఁడు*తవళికాఁడు

తే. కల్లరియు గొంటు కైలాట*కాఁడు చెదుగు
బేరజము కుచ్చితుఁడు దోస*కారి చెనఁటి
పాలసుఁడు నాలిబూతంబు*పలువ తులువ
కూళ గడు సన వర్తిల్లుఁ*గుజనుపేళ్లు. 11

దొంగ : తెక్కలికాడు, దొరకోలుసన్నాసి, ముచ్చు, ఎత్తుబరికాడు
ముడియవిడుపు తెరువాటుకాడు, కత్తెరదొంగ,
చేవాడికాడు, వల్లడికాడు, కన్నగాడు, మునిముచ్చు,
గడిదొంగ. **తస్కరుడు**

దుష్టుడు : చెండిపోతు, గరాసు, మొండికట్టె, టకటొంకు, టాటోటు, టక్కులాడు, పిసాళి, టక్కరి, ముడికాడు, తవళికాడు, కల్లరి, గుగ్గొంటు, కైలాటకాడు, చెడుగు, బేరజము కుచ్ఛితుడు , దోసకారి, చెనటి. పాలసుడు నాలిబూతము, పలువ, తులువ, కూళ, గడుసు. **కుజనుడు,**


పొట్టి


పిచ్చిమనిషి

ఆ. పాప బుడుత చిఱుత*పట్టి సిసువు కందు
కూన నిసువు బిడ్డ*కుఱ్ఱ బొట్టె
యనఁగ శిశుసమాఖ్య*లగుఁ గొమరుండు నాఁ
గొడుకు నాఁ గుమార*కుండు వెలయు 12


పాప


రూపసి


విలాస పురుషుడు

పాప : బుడుత, చిరుత, పట్టి, సిసువు, కందు, కూన, నిసువు, బిడ్డ, కుఱ్ఱ, బొట్టె (శిశువు)
కొడుకు : కొమరుడు **కుమారకుడు**


గుడ్డి


బాలుడు

ఆ. వటుసమాఖ్య లగును*వసుధలోఁ గొండిక
వాఁ డనంగఁ బడుచు*వాఁ డనంగఁ
బిన్న వాఁ డనంగఁ*జిన్నవాఁ డనఁగను
(వినుతగుణసనాథ!*విశ్వనాథ!) 13

బాలుడు : కొండికవాడు, పడుచువాడు, పిన్నవాడు, చిన్నవాడు (వటువు)

సీ. గిటక పొట్టి కుఱుచ*గిట్ట గు జ్జనఁగ వా
మనుఁ డొప్పుఁ జను నప*స్మారిపేళ్లు
వెడఁగు వేఁదుఱు వెఱ్ఱి*వీఱిడి వేఱిఁడి
వెంగలి వెంబర*విత్తనంగఁ
జతురునకును బేళ్లు*జాణ దంట వలంతి
వెరవరి ప్రౌఢ నే*ర్పరి యనంగ
ప్రన్ననివాఁడు రూ*పరి చూడఁగలవాఁడు
చక్కనివాఁడు నా*జగతిఁ బరఁగు

తే. సుందరాకారవంతుండు*సొగసుకాఁడు
వన్నెకాఁ డన శృంగారి*వసుధ వెలయు
నంధకునిపేళ్లు చీకు గ్రు*డ్డనఁగ మూఁగ
మూవ యన మూకనామముల్*(దేవదేవ!) 14

**పొట్టివాడు :** పొట్టి గిటక, కురచ, గిట్ట, గుజ్జు (వామనుడు)

**పిచ్చి మనిషి :** వెడగు, వేదురు, వెర్రి, వీరిడి, వేరిడి, వెంగలి, వెంబరవిత్తు (అపస్మారి)

**నేర్పరి :** జాణ, దంట, వలంతి, వెరవరి, ప్రోడ (చతురుడు)

**రూపసి :** ప్రన్ననివాడు, రూపరి,చూడగలవాడు, చక్కనివాడు (సుందరుడు)

**విలాసపురుషుడు :** సొగసుకాడు, వన్నెకాడు (శృంగారి)

**గుడ్డి :** చికు (అంధకుడు)

**మూగ :** మూవ (మూక)

క. కాయము పేర్లై వెలయును
మే యన నొడ లనఁగ మేను*మెయి యన భోగ్య
ప్రాయము పేర్లగుఁ బరువము
పాయము జవ్వన మనంగ*(భావజదమనా!) 15

**శరీరం :** మే, ఒడలు, మేను, మెయి (కాయం)

**యౌవనం :** పరువం, పాయం, జవ్వనం (ప్రాయం)

**తే.** నెఱులు కురులు వెండ్రుకలు నా*నెఱిక లనఁగఁ
గొప్పు తుఱు మన వేనలి*క్రొవ్వెద యనఁ
గేశధమ్మిల్లములు మించుఁ*గీలుగంటు
క్రొమ్ముడి యనంగఁ గేశబం*ధ మ్మగు (భవ!) 16




**వెంట్రుకలు :**

**వెండ్రుకలు** నెరులు, కురులు, ఎరకలు వెండ్రుకలు (కేశములు)

**కొప్పు :** తురుము, వేనలి, కొవ్వెద (ధమ్మిల్లం)

**వెంట్రుకల ముడి :** కీలుగంటు, కొమ్ముడి (కేశ బంధం)




**తే.** నొసలు నెన్నొసల్ నుదురు నె*న్నుదు రనంగఁ
దనరు ఫాలంబు చూడ్కి చూ*పనఁగ నొప్పు
నాహ్వయము లీక్షణమునకు*నక్షికాఖ్య
లలరుఁ గన్ గను కన్ను నా*(నభ్రకేశ!) 17

**నుదురు :** నొసలు, నెన్నొసలు, నెన్నుదురు (ఫాలం)

**చూపు :** చూడ్కి (ఈక్షణం)

**కన్ను :** కన్, కను (అక్షి)




క. వీను లనఁ జెవు లనంగా
జానుగు లన నాహ్వయములు*శ్రవణంబులకున్
గౌ నన నడు మనఁగా నభి
ధానము లగు మధ్యమునకుఁ*(దరుణేందుధరా!) 18

**చెవి :** వీను, జానుగు (శ్రవణం)

**నడుం :** కౌను (మధ్యం)

తే. అక్కు ఱొమ్మెద బోర నా*నలరు వక్ష
మాస్యమున కొప్పుచుండు నా*ఖ్యలు మొగంబు
మోర మో మనఁ బేర్లొప్పు*నూరువునకుఁ
బెందొడ యనంగఁ గుఱువు నా*(నందివాహ!) 19




రొమ్ము : అక్కు, ఎద, బొర (వక్షం)
మొగం : మోర, మోము (ఆస్యం)
తొడ : పెందొడ, కురువు (ఊరువు)

తే. వదనగుహ యొప్పు నోరు నా*వాయి యనఁగఁ
బల్లు పలు నాఁగ దంతంబు*పేళ్లు వెలయుఁ
బెదవి వాతెఱ మోవి య*న్పేళ్లఁ దనరు
చుండు నోష్ఠంబు (శీతాంశు*ఖండమౌళి!) 20




నోరు : వాయి (వదన గుహ)
పల్లు : పలు (దంతం)
పెదవి : వాతెర, మోవి (ఓష్ఠం)

క. కయి యనఁ గై నాఁ గే లనఁ
జెయి యనఁ జై నాఁగఁ జెయ్యి*చే నా హస్తా
హ్వయము లగు (నన్నపూర్ణా
ప్రియవల్లభ! కాశికాపు*రీవరనిలయా!) 21



చెయ్యి : కయి, కై, కేలు, చెయి, చై, చే (హస్తం)

క. ఎద యన డెందం బనఁగా
మది యనఁగా నెడఁ దనంగ*మఱి యుల్లము నా
హృదయమునకు నివి యెసఁగును
విదితంబుగ నాహ్వయములు*(విశ్వాధిపతీ!) 22

హృదయం : ఎద, డెందం, మది, ఎడద, ఉల్లం.(మనస్సు)

క. లోఁజె య్యన నఱచె య్యనఁ
గాఁ జెల్లును బేళ్లు రెండు*కరతలమునకున్
మీఁజె య్యన బెడచెయ్యియు
నాఁ జనుఁ గరచరమభాగ*నామములు (శివా!) 23




అరచెయ్యి : లోఁజెయ్యి (కరతలం)
పెడచెయ్యి, మీఁజెయ్యి, (కరచరమభాగం)










ఆ. పొట్ట డొక్క కడుపు*బొజ్జ బొఱ్ఱ యనంగ
నొప్పుచుండు నాఖ్య*లుదరమునకు
నాభిబిలమునకును*నామధేయము లగు
బొడ్డు నాఁగ మఱియుఁ బొక్కి లనఁగ. 24

పొట్ట : డొక్క, కడుపు, బొజ్జ, బొర్ర (ఉదరం)
బొడ్డు : పొక్కిలి (నాభిబిలం)

తే. వె న్నునంగను వీఁపు నా*వెనుకమేను
నాఁగఁ జరమాంగమున కొప్పు*నామములుగఁ
బుఱ్ఱె తలపాల నాఁ బున్క*పుఱియ నాఁ గ
పాలమున కాఖ్య లై యొప్పు*(ఫాలనేత్ర!) 25

క. అడు గంజ హజ్జ యనఁగాఁ
బుడమిఁ బదంబునకును నామ*ములు విలసిల్లున్
మెడ కుత్తు కఱ్ఱు గొం తన
నడరు గళంబునకుఁ బే (ళ్ల*నంగధ్వంసీ!) 26

అడుగు : అంజ, హజ్జ, (పదం)
గొంతు : మెడ, కుత్తుక, అర్రు (గళం)

ఆ. బువ్వ వంటకంబు*బోనంబు మెతుకు కూ
డోగిరము పసాద*మోరె మనఁగ
నన్న మొప్పుఁ జేల*మలరుఁ బుట్టంబు దు
వ్వలువ చీర కోక*వలువ యనఁగ. 27










వీపు : వెన్ను, వెనుకమేను, (చరమాంగం)
పుర్రె : తలపాల, పున్క (పునుక), పురియ (కపాలం)

అన్నం : బువ్వ, వంటకం, బోనం, మెతుకు, కూడు, ఓగిరం, పసాదం, ఓరెం.
కోక : పుట్టం, దువ్వలువ, చీర, చలువ (చేలం)



భోంచేయు

తే. మెసవె నారోగిణమొనర్చె*మెక్కెఁ దినియెఁ
గుడిచె నారగించెను బసా*పడియె నమలె
సాపడె ననంగ నొప్పు భో*జనము సేసె
ననట కివి యాఖ్యలై (యీశ!*యభ్ర కేశ!) 28

భోంచేయు : మెసవు, ఆరోగిణమొనర్చు, మెక్కు, తిను, కుడుచు, ఆరగించు, పసాపడు, నమలు, సాపడు (భోజనం చేయు)

క. నాన యన సిగ్గు సిబ్బితి
నా నివి వ్రీ డాపదంబు*నామంబు లగుం
బానము సేయుటపేళ్లగు
నానుట త్రావు టనఁ ద్రాగు*టనఁ గ్రోలు టనన్.
29




సిగ్గు నాన, సిబ్బితి, (వ్రీడ)
తాగు : ఆను, త్రావు, క్రోలు, (పానంచేయు)

ఆ. తళియ పళ్లెరంబు*తెలె హరివాణంబు
తట్టి కంచ మనఁగఁ*దనరుఁ బాత్ర
చెల్లుఁ జషకమునకు*పేళ్లు డబ్బుర కోర
గిన్నె యనఁగ (రజత*గిరినివాస!) 30




కంచం : తళియ, పళ్లెరం, తెలె, హరివాణం, తట్టి (పాత్ర)
గిన్నె : డబ్బుర, కోర (చషకం)

తే. నతికిఁ బేళ్లొప్పు జోత దం*డము జొహారు
మ్రొక్కు జేజే యనంగఁ గేల్*మొగిచెఁ గొలిచె
నెఱగెఁ జేమోడ్చె నన నమ*స్కృతి యొనర్చె
ననుట కివి యాఖ్య లగు (నీశ!*యభ్ర కేశ!) 31



నమస్కరించు

దండం : జోత, జొహారు, మ్రొక్కు, జేజే (నతి)
నమస్కరించు : కేలుమొగుచు, కొలుచు, ఎరగు, చేమోడ్చు (నమస్కృతి ఒనర్చు)

తే. ఒప్పు శయనించుటకును బ*న్నుండె బండెఁ
బవ్వడించెఁ బరుండెను*బవ్వళించె
నత్తమిల్లె నన న్మఱి*మెత్త సెజ్జ
పఱుపు పా న్పనఁ దగు శయ్య*(ఫాలనేత్ర!) 32




పడుకొను : పన్నుండు, పండు, పవ్వడించు, పరుండు, పవ్వళించు,
అత్త మిల్లు. (శయనించు)

పానుపు : మెత్త, సెజ్జ, పరపు (శయ్య)

**తే.** ఒప్పు ధ్వనిపేళ్లు రొద యన*నులివు నాఁగ
స ద్దనంగను గూఁత నాఁ*జప్పు డనఁగ
నలుకు డన రోధనము సేసె*ననుట కాఖ్య
లెసఁగు నఱచెను వాపోయె*నేడ్చె ననఁగ. 33

కూఁత : రొద, ఉలివు, సద్దు, చప్పుడు, అలుకుడు ధ్వని

ఏడ్చు : అరచు (రోదనంచేయు) **వాపోవు,**

**క.** అగుఁ బేళ్లు నీరువ ట్టన
దగ దప్పియు దూప యనఁగ*దాహంబునకున్
నగవు నగు నవ్వు నవు నా
నగు నాఖ్యలు హాసమునకు*(నగజాదీశా!) 34



దప్పి : నీరుపట్టు, దగ, దూప దాహం

నవ్వు : నగవు, నగు, నవు (హాసం)

**క.** చాగము నాఁ బుడు కనఁగా
నీగి యనఁగ నిడుట యనఁగ*నీవి యనంగాఁ
దేగము నాఁ బెట్టుడు నాఁ
ద్యాగమునకు నాఖ్య లగుచు*ధరఁ బరఁగు(శివా!)
35




త్యాగం : చాగం, పుడుకు, ఈగి, ఇడుట, ఈవి, తేగం, పెట్టుడు.

**ఆ.** ఎలసె బెరసె హత్తె*నెనసె నదికెఁ జెందె
బొందె దొరసెఁ గూడె*నొందె చెనకె
ననఁగ సక్తమయ్యె*ననుటకు నివి యాఖ్య
లగు (గిరీశ! యీశ!*యభ్రకేశ!) 36

కలియు : ఎలయు, బెరయు, హత్తు, ఎనయు, అదుకు, చెందు,
పొందు, దొరయు, కూడు, ఒందు, చెనకు (సక్తమగు)




**ఆ.** ఎడసెఁ బాసె వేఱు*పడెఁ బురివిచ్చె నా
నలరు భేద మయ్యె*ననుట పేళ్లు
స్వవశ మయ్యె ననుట*కవుఁ బేళ్లు లోనయ్యె
నగ్గమయ్యె ననఁగ*(నసమనేత్ర!) 37

వేరుపడు : ఎడయు, పాయు, పురివిచ్చు (భేదమగు)

స్వాధీనమగు : లోనగు, అగ్గమగు (స్వవశమగు)




**ఆ.** అగు గృహీత మయ్యె*ననుటకుఁ బే ళ్లగఁ
పడియెఁ జేపడియెను*బట్టువడియెఁ
జిక్కువడియెఁ దగిలెఁ*జిక్కెఁ దగుల్పడె
ననఁగ (నగనివేశ!*యభ్ర కేశ!) 38

చిక్కు : అగపడు, చేపడు, పట్టువడు, చిక్కువడు, తగులు,
తగుల్పడు (గృహీతమగు)




**తే.** అనియె నొడివె వక్కాణించె*నాడెఁ జెప్పె
వినిచె వాక్రుచ్చెఁ బలికె నాఁ*జను వచించె
ననుట కాలించె నాలకిం*చెను వినె నన
నలరు నవధరించె నటంట*కాఖ్య (లీశ!) 39

పలుకు : అను, నొడువు,వక్కాణించు, ఆడు, చెప్పు, వినుచు,
వాక్రుచ్చు (వచించు)
విను : ఆలించు, ఆలకించు (అవధరించు)

క. కనియెను చూచెను కాంచెను
కనుఁగొనెఁ గన్గొనె ననంగఁ*గలయవి పేళ్లై
చను వీక్షించె నటంటకు
(ఘనతరగోరాజగమన !*కాయజదమనా! ) 40



చూచు : కను, కాంచు,కనుగొను, కన్గొను (వీక్షించు)

క. చనుఁ గృతగమనుఁడ నయ్యెద
ననుటకు నామంబు లగుచు*నవని నరిగెదన్
జనియెదఁ బోయెద నేగెద
పనివినియెద ననెడునట్టి*పేలుకులు (రుద్రా!) 41




పోవు : అరుగు, చను, ఏగు, పనివిను (కృతగమనుడగు)

**ఆ.** ద్విగుణమున కభిఖ్య*లగు నిబ్బ డిమ్మడి
జంట దంట దుగయు*జమిలి రెట్టి
యినుమడి యన మిథున*మున కాఖ్య లగు జోడు
దోఁయి కవ యనంగ*(ధూతకలుష!) 42







**రెండింతలు :** ఇబ్బడి, ఇమ్మడి, జంట, దంట, దుగ, జమిలి, రెట్టి, ఇనుమడి (ద్విగుణం)

**జోడు :** దోయి, కవ (మిధునం)




సీ. ఒం డొక్కఁ డొకటి యొ*క్కొం డన నగు నేక
మీరు రెం డిరునాఁగ*నెసఁగు ద్వయము
తిగ మూఁడు మూ ర్నాఁగఁ*దగు త్రయి తీవంచ
నలు నాల్గు చౌ యన*నగుఁ జతుష్క
మెసఁగుఁ జౌవంచ యై*దే ననఁ బంచకం
బా ఆరుమూఁ డిత్తి*గనఁగ నొప్పు
షట్కంబు ఋషిసంఖ్య*సత చక్కవగడ యే
డన నొప్పు నష్ట సం*ఖ్యకును బేళ్లు

తే. దనరునిరునాలు గెనిమిది*దచ్చి యనఁగఁ
బరఁగు నీరాఱు పంౘ్రెండు*బార యనఁగఁ
ద్వాదశమునకు నాఖ్యలు*ధరణియందు
(వినుతకరుణా సనాథ ! శ్రీ*విశ్వనాథ !) 43

**ఒకటి :** ఒండు, ఒక్కడు, ఒక్కొండు (ఏకం)

**రెండు :** ఈరు, ఇరు (ద్వయం)

**మూడు :** తిగ, మూరు (త్రయి)

**నాలుగు :** తీవంచ, నలు, నాల్గు, చౌ (చతుష్కం)

**ఐదు :** చౌవంచ, అయిదు, ఏను (పంచకం)

**ఆరు :** ఇరుమూడు, ఇత్తిగ (షట్కం)

**ఏడు :** సత, చక్కవగడ (ఋషిసంఖ్య)

**ఎనిమిది :** ఇరునాలుగు, దచ్చి (అష్టసంఖ్య)

**పన్నెండు :** ఈరారు, బార, (ద్వాదశం)

తే. జరిగె నూడెను జాఱెను*నుఱికె వెళ్లెఁ
బాఱెఁ బఱచెను దొలఁగె న*ప్పలుకు లెల్ల
నవనిలోనఁ బలాయితుం*డయ్యె ననుట
కాఖ్యలై యొప్పుఁ (జంద్ర రే*ఖావతంస!) 44



పారిపోవు

**పారిపోవు :** జరుగు, ఊడు, జారు, ఉరుకు, వెళ్ళు, పారు, పరచు, తొలగు (పలాయితుడగు)

క. వేంచేసెను వచ్చెం జను
దెంచెను విచ్చేసె నరుగు*దెంచె ననఁగ నే
తెంచె నన నయ్యె నాగతుఁ
డంచుం బలుకుటకు నాఖ్య*(లంబరకేశా!) 45



వచ్చు

వచ్చు : వేంచేయు, చనుదెంచు, విచ్చేయు, అరుగుదెంచు, ఏతెంచు (ఆగతుడగు)

తే. నాఁటిసుత నాఁటినుండియు*నాఁటఁగోలె
నాఁటఁబట్టి నాఁడుమొదలు*నాఁగ నాహ్వ
యమ్ము లయ్యెఁ దదారభ్య*యనుట కవని
(వినుతకరుణాసనాథ ! శ్రీ*విశ్వనాథ !) 46

నాటినుండి : నాటిసుత, నాటగోలె, నాటబట్టి, నాడుమొదలు (తదారభ్య)

తే. వైరమునకును ధర సమా*హ్వాయము లమరుఁ
గంటు పగ మచ్చరంబు సూ*డొంటమి యన
వలపు కూరిమి మేలు నా*నలరుఁ బేళ్లు
మోహమునకును (శారదాం*బుదనిభాంగ !) 47

పగ : కంటు, మచ్చరం, సూడు, ఒంటమి (వైరం)
ప్రేమ : వలపు, కూరిమి, మేలు (మోహం)

క. పెనఁకువ జగడము కయ్యం
బని బవరము కలను చివ్వ*యాలము పోట్లా
టన దురము పోరు నాఁగాఁ
జను యుద్ధంబునకుఁ బేళ్లు*(చంద్రార్ధధరా!) 48




యుద్ధం : పెనకువ, జగడం, కయ్యం, అని, బవరం, కలను, చివ్వ, ఆలం, పోట్లాట, దురం, పోరు

ఆ. సదమదంబు సేసెఁ*జక్కాడె నుగ్గాడెఁ
జదిపెఁ బీఁచమడచెఁ*జంపెఁ గెడపె
నుఱుముసేసెఁ ద్రుంచెఁ*బరిమార్చెఁ దెగటార్చె
మన్నిగొనియెఁ దునిమె*మడిపె ననఁగ 49

తే. హతము గావించె ననుటకు*నాఖ్య లయ్యె
మనిపె నేలెను బ్రతికించె*మంచెఁ బ్రోచె
సాఁకె నన నొప్పు నాఖ్యలు*సరవితోడ
నరయఁ బోషించె ననుటకు*(నంబికేశ !) 50




చంపు : సదమదం చేయు, చక్కాడు, నుగ్గాడు, చదుపు, పీచ మడచు, కెడపు, నురుము చేయు, తుంచు, పరిమార్చు, తెగటార్చు, మన్నిగొను, తునుము, మడుపు (హతంగావించు)
బతికించు : మనుచు, ఏలు, మంచు, ప్రోచు, సాకు (పోషించు)

క. ధరలో శూరాహ్వయములు
పరఁగున్ మొనకాఁ డనంగ*బం టనఁగాఁ బో
టరియన వడిగలవాఁ డన
బిరు దన వాఁడిమగఁ డనఁగ*(భీమకపర్దీ !) 51

శూరుడు : మొనకాడు, బంటు, పోటరి, వడిగలవాడు, బిరుదు, వాడిమగడు.

తే. బాసట యనంగఁ దోడ్పాటు*నా సమాహ్వ
యంబు లగుచుండు రెండు సా*హాయ్యమునకు
నాఖ్యలుశుభంబునకును ల*గ్గనఁగ బాగ
నంగ మే లన లెస్స య*నంగ (నీశ!) 52


సహాయం


శుభం

సహాయం : బాసట, తోడ్పాటు (సాహాయ్యం)
శుభం : లగ్గు, బాగు, మేలు, లెస్స.

ఆ. కూలె నీల్గెఁ జచ్చెఁ*గాలంబుసేసెను
గెడసె సమసె నాఱె*మడిసెఁ జెల్లెఁ
బెద్దనిదురవోయె*బిద్ధె దోరెను గంతు
గొనియె ననుటపేళ్ల*గును మృతునకు 53


చచ్చు

చచ్చు : కూలు, నీల్గు, కాలంచేయు, కెడయు, సమయు, ఆరు, మడియు, చెల్లు, పెద్దనిదురపోవు, బిద్ధు, దోరు, గంతుగొను (మృతుడగు)

సీ. తిమ్మనైనది యనఁ*దిన్ననైనది యన
జానైన దనఁగ బా*గైన దనఁగ
నాణెమైన దన వి*న్నాణమైనది యన
మానైన దనఁగ లె*స్సైన దనఁగఁ
బిన్ననైనది యనఁ*జెన్నైనదన నలు
వైనది యనఁగఁ జె*ల్వైన దనఁగఁ
బొనరినయది యన*నొనరిన దనఁగఁ జొ
క్కటమైన దనఁగ జ*క్కని దనంగ
సొబగైన దనఁగను*సొంపైన దనఁ గొమ
రైనది యన గొన*బైన దనఁగఁ
దోరమైన దన సిం*గారమైనది యన
మేలైన దనఁగ*మెచ్చైన దనఁగ

తే. మురువుగలయది యొప్పైన*దొరవుగలది
యందమైనది తనరిన*దలరినట్టి
దనఁగఁ బరఁగిన దనఁ బేళ్లు*తనరుచుండు
మంజులం బైన దనుటకు*(మదనదమన !) 54

అందమైన : తిమ్మనైన, తిన్ననైన, జానైన, బాగైన, నాణెమైన, విన్నాణమైన, మానైన, లెస్సైన, పిన్ననైన, చెన్నైన, నలువైన, చెల్వైన, పొనరిన, ఒనరిన, చొక్కటమైన, చక్కని, సొబగైన, సొంపైన, కొమరైన, గొనబైన, తోరమైన, సింగారమైన, మేలైన, మెచ్చైన, మురుగు గల, ఒప్పైన, ఒరవుగల, తనరిన, అలరిన, పరగిన (మంజులమైన)

తే. కపుర మనఁ గప్పురం బనఁ*గప్ర మనఁగఁ
బుడమిఁ గర్పూర మొప్పుఁ దాం*బూల మొప్పు
వీడియము వక్కలాకులు*విడెము తమ్మ
లంబు వీడెంబు వీడ్య మ*నం (బురారి !) 55


కర్పూరం


తాంబూలం

కర్పూరం : కపురం, కప్పురం, కప్రం

తాంబూలం : వీడియం, వక్కలాకులు, విడెం, తమ్మలం, వీడెం, వీడ్యం.

పౌరుషం : మగతనం, గండు, మగటిమి

ధైర్యం : గట్టి, ఉక్కు, చేగ, దిటం, చేవ, ఉదుటు, దిట్టం, ఉరిది బిగువు (ధృతి)

తే. వెలయుచుండును సిరి లచ్చి*కలిమి యనెడు
పేళ్ల సంపద యెద్దడి*పేదఱికము
లేమి నిప్పచ్చరము నెవ్వ*లేమి డనఁగ
నలరు దారిద్ర్యమునకు నా*ఖ్యలు (గిరీశ !) 56



సంపద



పేదరికం

సంపద : సిరి, లచ్చి, కలిమి.

పేదరికం : ఎద్దడి, లేమి, నిప్పచ్చరం, నెవ్వ, లేమిడి (దారిద్ర్యం)

తే. మగతనంబన గండన*మగఁటిమి యనఁ
బౌరుషంబున కాఖ్యలై*పరఁగుచుండు
నుక్కు చేగ దిటము చేవ*యుదుటు గట్టి
దిట్ట ముఱిది బిగువు నాఁగ*ధృతికిఁ బేళ్లు. 57



పౌరుషం

తే. బద్ధు నా బొంకు నాఁగ ద*బ్బర యనంగఁ
గల్ల నాఁగ హుళిక్కి నాఁ*జెల్లుఁ బేళ్లు
ధర నసత్యమునకును స*త్యంబు పరఁగు
నిజ మనఁగ నిక్కువం బన*నిక్క మనఁగ. 58

అబద్ధం : బద్ధు, బొంకు, దబ్బర, కల్ల, హుళిక్కి (అసత్యం)

నిజం : నిక్కువం, నిక్కం (సత్యం)

బెడఁద దెస చేటు చేడ్పా
ట్గొడ వాఁత్రం బంగలార్పు*గోరంబు దొసం
గిడుమ వెత కస్తి యంగద
కడగం డ్లనఁ జను విపత్తు*(గౌరీరమణా!) 59



ఆపద

ఆపద : బెడద, దెస, చేటు, చేడ్పాటు, గొడవ, ఆత్రం, అంగలార్పు, గోరం, దొసగు, ఇడుమ, వెత, కస్తి, అంగద, కడగండ్లు (విపత్తు)

క. వెల జట్టి విలువ రొయనఁ
గలనుడువులు దనరుచుండుఁ*గ్ర యనామములె
వెలయంగ వంగసము నాఁ
గొల మన వంగడము నాఁగఁ*గులమొప్పు(శివా!)
60




వెల : జట్టి, విలువ, రో (క్రయం)
కులం : వంగసం, కొలం, వంగడం.

క. క్రమ్మఱ నెప్పటి వెండియుఁ
గ్రమ్మఱి తిరుగన్ మఱిన్ మ*రల మగుడను నా
నిమ్మహిఁ బునఃపదంబున
కిమ్ముల నివి యాఖ్య లగు (మ*హీధరచాపా!)
61

మరల : క్రమ్మర, ఎప్పటి, వెండి, క్రమ్మరి, తిరుగ, మరి, మగుడ (పునః)

క. ఒకమరి యొకపరి యొకమా
టొకసా రొకతేప యనఁగ*నొకపా రనఁగా
నొకవిడుత యొక్కతూ కన
నొకతడవ యనంగ మఱియు*నొకతూరి
యనన్. 62

తే. ఏకవారం బనుట కొప్పు*నిన్ని పేళ్లు
జగతిఁ బల్మాఱు వేమాఱు*సా రె పెక్కు
మాఱు లెన్నేనిమా ర్లనఁ*బరఁగు నాఖ్య
లగుచు నివి బహువారంబు*లనుట (కీశ!) 63




ఒకసారి : ఒకమరి, ఒకపరి, ఒకమారు, ఒకతేప, ఒకఫారి, ఒకవిడుత, ఒకతూకు, ఒకతడవ, ఒకతూరి (ఏకవారం)
చాలా సార్లు : పల్మారు, వేమారు, సారె, పెక్కుమార్లు, ఎన్నేని మార్లు (బహువారం)

తే. త్వరితమున కొప్పుఁ బేళ్లు చె*చ్చెరను సరగ
వేగిరము వేగ వేళము*వెసను వడిగ
గ్రక్కునను గ్రద్దన ననంగఁ*గ్రన్న ననఁగ
గొబ్బునను దిగ్గున ననంగఁ*(గుధరచాప!) 64

తొందర : చెచ్చెర, సరగ, వేగిరం, వేగ, **వేళం**, వెస, వడి, గ్రక్కున, గ్రద్దన, క్రన్నన, గొబ్బున, దిగ్గున (త్వరితం)

క. కలవు వివరింపఁగా నా
ఖ్యలు వరుసన్ నిర్గమించె*ననుటకు ధరలో.
వెలువడియె వెళ్లె వెడలెను
వెల లె ననం (జిత్ప్రకాశ!*విశ్వాధిపతీ!) 65




వెళ్ళు : వెలువడు, వెడలు, వెలలు (నిర్గమించు)

క. వినుతి యొనరించె ననుటకుఁ
దనరున్ నామంబు లగుచు*ధరపై నగ్గిం
చెను గైవారము సేసెన్
గొనియాడెను బొగడె ననఁగఁ*గొండాడె ననన్. 66

పొగడు : అగ్గించు, కైవారంచేయు, కొనియాడు, కొండాడు (వినుతి ఒనరించు)

సీ. చుట్టలు విందులు*చుట్టాలు బందుగు
లనఁ జను బంధు*సమాహ్వయములు
వఱలు నన్యుఁడు లాతి*వాఁ డనఁగా వింత
వాఁ డనఁగాఁ బెఱ*వాఁ డనంగ
వ్యాజంబునకు నామ*మౌ నెపం బనఁగ న
న్వేషించె ననుట కౌ*వెదకె నెమకె
నరసె రోసె ననంగ*నారసెఁ దడవె నాఁ
గాంక్షకుఁ బేరు లౌఁ*గ్రమముతోడఁ

తే. (గచ్చు కోరిక తమి కోర్కి*యిచ్చ యనఁగ
నెపుడు నెడపక యుడుగక*యెల్లపు డన
నిచ్చ యనయంబు నాఁగను*నిచ్చ లనఁగఁ
దనరు నాఖ్యలు సంతతం*బనుట (కీశ!) 67






చుట్టాలు






చుట్టాలు : చుట్టలు, విందులు, బందుగులు (బంధువులు)
ఇతరులు : లాతివాడు, వింతవాడు, పెరవాడు (అన్యుడు)
సాకు : నెపం (వ్యాజం)
వెదకు : నెమకు, అరయు,రోయు, ఆరయు, తడవు (అన్వేషించు)
కోరిక : క్రచ్చు, తమి, కోర్కి, ఇచ్చ (కాంక్ష)
ఎల్లప్పుడు : ఎపుడు, ఎడపక, ఉడుగక, ఎల్లపుడు, నిచ్చ,
అనయం, నిచ్చలు (సతతం)



సీ. తనరుఁ బ్రవేశించె*ననుటకునాఖ్యలు
తూకొనెఁ జొచ్చెను*దూఱె ననఁగ
నంఘ్రి ఠతాడితుఁ జేసె*ననుటకుఁ బేళ్లగుఁ
దాఁచెఁ గాళ్లఁ గ్రుమ్మెఁ*దన్నె ననఁగ
నాలస్య మొనరించె*ననుటకుఁ జెల్లు నా
మమ్ములు తడసెను*మసలె ననఁగఁ
ద్యక్తంబు గావించె*ననుటకు నాఖ్య లౌ
వీడెను వదలెను*విడిచె ననఁగఁ

తే. దారుమాఱయ్యె వీడ్వడెఁ*దడఁబడె నన
నాఖ్య లొప్పు విపర్యస్త*మయ్యె ననుట
కలరుఁ బ్రహరించె ననుట కా*హ్వయముళడిచెఁ
గొట్టె మొత్తెను మోఁదె నాఁ*(గుధరనిలయ!) 68

ప్రవేశించు : తూకొను, చొచ్చు, తూరు.
తన్ను : తాచు, కాళ్ళ (తో) గ్రుమ్ము (అంఘ్రితాడితుచేయు)
ఆలస్యంచేయు : తడయు , మసలు(ఆలస్యమొనరించు)
విడుచు : వీడు, వదలు (త్యక్తంగావించు)
తారుమారగు : వీడ్వడు, తడబడు (విపర్యస్తమగు)
కొట్టు : అడచు, మొత్తు, మోదు (ప్రహరించు)

సీ. ముందట నెదుటను*మ్రోల ముంగల నాఁగ
నాఖ్య లౌ సముఖమం*దనుట (కభవ!)
యలయిక బడలిక*యలపుసేద యనంగ
శ్రమమున కాఖ్య లౌ*(శమనదమన!)
తాలిమి యోరుపు*తాలిక నాఁగను
క్షమకు నాహ్వయము లౌఁ*(జర్మవసన ! )
ఠవళి బవంతంబు*టక్కు దుత్తూరంబు
వెడ్డు నా ఛద్మ మౌ*(విషమనేత్ర!)

తే. వెఱ పనఁగ నెద యనఁగను*వెఱ యనంగ
నళు కనఁగ భీతి కాఖ్యలౌ*(నసితకంఠ!)
నిమ్మళం బన నెమ్మి నా*నెమ్మది యనఁ
దనరుఁ బేళ్లు నిరాంతక*మునకు (నీశ!) 69




ఎదుట : ముందట, మ్రోల, ముంగల (సముఖం)
బడలిక : అలయిక, అలపు, సేద, (శ్రమం)
ఓర్పు : తాలిమి, తాలిక (క్షమ)
టక్కు : ఠవళి, బవంతం , దుత్తూరం, వెడ్డు (ఛద్మం)
భయం : వెరపు, ఎద, వెర, అళుకు (భీతి)
నెమ్మది : నిమ్మళం, నెమ్మి (నిరాతంకం)







సీ. అసదు కొంచెము సైక*మలఁతి యన్నువ చిన్న
నలికంబు సన్నంబు*నాఁ దనర్చు
స్వల్ప మెక్కుడు నాఁగఁ*జాల నెంతేనియు
మిగులఁ దద్దయుఁ దద్ద*మిక్కిలి యనఁ
బెద్దయు ననునివి*పేళ్లగు భృశముగా
ననుటకు నుత్కట*మయ్యె ననుట
కగుఁ బేళ్లు వెగ్గలం*బయ్యెఁ గ్రిక్కిఱిసె వె
క్కసమయ్యె నునునివి*క్రమముతోడ

ఆ. సగ్గెఁ గుందె డొంకెఁ*దగ్గె ను సడలెను
క్రుంగె నుబ్బణంగె*స్రుక్కె ననఁగఁ
దనరుఁ బేళ్లు క్షీణ*దశ నొందె ననుటకు
(నీశ్వరీసనాథ !*విశ్వనాథ!) 70

కొంచెం : అసదు, సైకం, అలతి, అన్నువ, చిన్న, నలికం, సన్నం (స్వల్పం)
చాల : ఎంతేనియు, ఎక్కుడు, మిగుల, తద్దయు, తద్ద, మిక్కిలి, పెద్ద (భృశం)
కిక్కిరియు : వెగ్గలమగు, వెక్కసమగు (ఉత్కటమగు)
తగ్గు : సగ్గు, కుందు, డొంకు, సడలు, క్రుంగు, ఉబ్బణగు, స్రుక్కు (క్షీణదశనొందు)

ఆ. మించు వాసి మేలు*మేటి పెచ్చు చ్చున
నధికమునకు నాఖ్య*లగుచు వెలయుఁ
బనులు నాఁగఁ జెయువు*లనఁ జేత లన నొప్పుఁ
గర్మమునకుఁ బేళ్లు*(చర్మవసన!) 71







ఎక్కువ : మించు, వాసి, మేలు, మేటి, పెచ్చు, ఎచ్చు (అధికం)
పని : చెయువు, చేత (కర్మం)

ఆ. అనిపె ననిచెఁ బనిచెఁ*నంపెను బంపెఁ
బుచ్చె గెలువుమనియెఁ*బొమ్మటనియె
ననఁగ నివి సమాఖ్య*లగును ప్రస్థాపించె
ననెడుక్రియకు (నీశ !*యభ్రకేశ!) 72



పంపు : అనుపు, అనుచు, పనుపు, పనుచు, అంపు, పుచ్చు, గెలువు
మను, పొమ్మను (ప్రస్థాపించు)




పిరికి పంద : పారుబోతు, పిరికి, పంద, కోచ (సమర భీరువు)
ధైర్యవంతుడు : దిట్ట, ఉక్కు, తునియ, గట్టి డెందం వాడు.




తే. కొదవ కొద కుందు తగ్గు త*క్కువ కొఱంత
వెలితి కొఱ లొచ్చు కడమ నా*వెలయు న్యూన
సమభిధానము లర సాము*సగము సవము
నా(గ నర్ధాహ్వయంబు లౌ*(నాగభూష!) 73

తక్కువ : కొదవ, కొద, కుందు, తగ్గు, కొరత, వెలితి, కొర, లొచ్చు,
కడమ (న్యూనం)
సగం : అర, సాము, సవం (అర్ధం)

తే. పేళ్లు పశ్చాత్తనుటకును*జెల్లు వెనుక(
బిదప( దర్వాత( బదపడి*పిమ్మట నన
మునుపు మునుమున్ను తొలితొల్లి*ముందు తొలుత
ననగ( బూర్వపదార్థాఖ్య*లౌ (గిరీశ!) 74

తర్వాత : వెనుక, పిదప, పదపడి, పిమ్మట (పశ్చాత్)
ముందు : మునుపు, మును, మున్ను, తొలి, తొల్లి, తొలుత

ఆ. పాఱు(బోతు పిఱికి*పంద కో(చ యనంగ(
బేళ్లు దనరు సమర*భీరువునకు
దిట్ట యుక్కు తునియ*గట్టిడెందంబువా(
డన(గధైర్యవంతు(*డలరు (నీశ!) 75

తే. ప్రౌజు చేరువ మొత్తంబు*బారు తుటుము
దండు పరి గమి కూటువ*పిండు దా(టు
మూ(క దళమును బేళ్లు స*మూహమునకు
(భుజగవరహార! యవిముక్త*పురవిహార!) 76




మొత్తం : ప్రౌజు, చేరువ, బారు, తుటుము, దండు, పరి, గమి,
కూటువ, పిండు, దాటు, మూక, దళం (సమూహం)

సీ. పూనె నూనెను దాల్చె*నానెను మోచె నా
వహియించె నీనుట కౌ*(నహివిభూష!)
నామము లుచ్చాట*నము చేసె ననుటకు
వరుసతో( దఱిమెను*బఱపె వెలిచె(
దోలెను ఱొప్పె నా*(ద్రుహిణాదిసురనుత!)
త్రిప్పెను నా( గ్రమ్మ*ఱించె ననగ
మగిడించె నన(గను*మరలించె నన్మసమా
హ్వాయములై పర(గు ని*వర్తితంబు

తే. చేసె ననుటకు (సురముని*సిద్ధసేవ్య!)
యడ్డగించెను నా నిల్పు*ననఁగ నాఁగె
నన నివారించె ననుటకు*నాఖ్య లమరు
(నగసుతానాథ! గుహగజా*ననసనాథ!) 77



ధరించు

తరుము



మరలించు

అడ్డగించు

ధరించు : పూను, ఊను, తాల్చు, ఆను, మోచు (వహియించు)
**తరుము :** పరపు, వెలుచు, తోలు, రొప్పు (ఉచ్చాటనచేయు)
**మరలించు :** తిప్పు, క్రమ్మరించు, మగిడించు (నివర్తితంచేయు)
**అడ్డగించు :** నిల్పు, ఆగు (నివారించు)

తే. దండ చేరువ సంగడి*దాపు చెంత
సరస చెంగట యొద్ద డ*గ్గఱ కురంగ
టండ పజ్జయు నా సమీ*పాఖ్య లమరు
(రమ్యధవళాంక! కలశనీ*రధినిషంగ!) 78

దగ్గర : దండ, చేరువ, సంగడి, దాపు, చెంత, సరస, చెంగట, ఒద్ద, **డగ్గర**, కురంగట, అండ, పజ్జ (సమీపం)

తే. అచట నచ్చట నచ్చోట*నందు నాడ
నచొట నచ్చొట నక్కడ*నయ్యెడ నట
ననఁగఁ దత్త్రదేశంబునం*దనుట కాఖ్య
లయ్యె (భక్తవిధేయ! యా*ర్యాసహాయ!) 79

అక్కడ : అచట, అచ్చట, అచ్చోట, అందు, ఆడ, అచొట, అచ్చొట, అయ్యెడ, అట (తత్త్రదేశమందు)

క. ఇరుగెలఁకుల నిరువంకల
నిరుదెస నిరుచక్కియందు*నిరుపక్కియలం
దిరుగ్రేవల నిరుగడ నన
బొరిఁబేళ్లగు నుభయపార్శ్వ*ముల ననుట(కజా!)
80



రెండు ప్రక్కల

రెండు ప్రక్కలు : ఇరుగెలకులు, ఇరువంకలు, ఇరుదెసలు, ఇరుచక్కియలు, ఇరుపక్కియలు, ఇరుగ్రేవలు ఇరుగడలు (ఉభయపార్శ్వాలు)

క. నవముగ ధరలో నీమా
నవవర్గువు వేడ్కఁ జదివి*నను వ్రాసిన మా
నవులకు ననవరతంబును
శివుఁ డవిముక్తేశ్వరుండు*చెలువం బొసఁగున్
81






సీ. వలిదిప్ప వడ(కుగు*బ్బలి చలిమిరిమల
గట్టులఱేడు ము*క్కంటిమామ
మంచు(గొండన హిమ*క్ష్మాధరాఖ్యలు చను
వేలుపు(గొండ జే*జేలగట్టు
పుత్తడిగుబ్బలి*పునుకకంచమువాని
విల్లు నా మేరువు*పేళ్లు వెలయు
వెలిదిప్ప ముక్కంటి*మల వెండికొండ నా(
గైలాసపర్వతా*ఖ్యలు సెలంగు

తే. వెలయు( దరిగొండ కవ్వంపు*మలయనంగ
మంథ రాఖ్యలు కడపటి*మల యనంగ(
జుట్టు(గొండన( దనరు నీ*క్షోణియందు(
జక్రవాళాద్రి (వృషవాహ ! శైల గేహ !.) 1

హిమాలయపర్వతం : వలిదిప్ప, వడకుగుబ్బలి, చలిమిరిమల, గట్టులరేడు, ముక్కంటిమామ, మంచుకొండ (హిమక్ష్మాధరం)
మేరుపర్వతం : వేలుపుకొండ, జేజేలగట్టు, పుత్తడిగుబ్బలి, పునుకకంచమువానివిల్లు
కైలాసపర్వతం : వెలిదిప్ప, ముక్కంటిమల, వెండికొండ
మంథరపర్వతం : తరికొండ, కవ్వపుమల.
చక్రవాళపర్వతం : కడపటిమల, చుట్టుకొండ.




ఆ. తూర్పు(గొండ నా(గ(*దొలుగట్టు నా(గను
బొడుపుగుబ్బ లన(గ(*బూర్వశిఖరి
పర(గు గ్రుంకుమెట్టు*పడమటికొండ నా
వెలయు నస్తశిఖరి*(విశ్వనాథ !.) 2

తూర్పుకొండ, తొలుగట్టు, పొడుపుగుబ్బలి(పూర్వశిఖరి)
పడమటికొండ క్రుంకుమెట్టు, (అస్తశిఖరి)




తే. ఒప్పు గిరిపేళ్లు మల గట్టు*తిప్ప మెట్టు
కొండ గుబ్బలి నా మేరు*(కుధరచాప!)
ఱాయి నా( గ ల్లనంగను*ఱా యనంగ
శిల కభిఖ్యలు దగు నిల*(శేషభూష !) 3

పర్వతం : మల, గట్టు, తిప్ప, మెట్టు, కొండ, గుబ్బలి (గిరి)
రాయి : కల్లు, రా (శిల)




తే. పల్లె కొట్టిక కొటిక కు*ప్పమ్ము నా(గ
నూరన(గ గ్రామనామంబు*లొప్పుచుండు(
బట్టణంబున కాఖ్యలు*పర(గు చుండు(
బ్రో లన(గ వీ డనంగను*(శూలపాణి !) 4

ఊరు : పల్లె, కొట్టిక, కొటిక, కుప్పం, గ్రామం
పట్టణం : ప్రోలు, వీడు.




ఆ. ఉనికిపట్టు తావు*మనికిప ట్టిర విల్లు
తెంకి యిక్క నట్టు*టెంకి యిమ్ము
నెలవు గీము నా(గ*నలరు నివాసదే
శంబునకును బేళ్లు*(చంద్ర మౌళి !) 5

ఇల్లు / నివసించే ప్రదేశం : ఉనికిపట్టు, తావు, మనికిపట్టు, ఇరవు, తెంకి, ఇక్క, వట్టు, టెంకి, ఇమ్ము, నెలవు, గీమ (నివాసదేశం)




సీ. తెంకాయచె ట్టనఁ*డెంకాయమ్రానన
నారికేళం బొప్పు*(నగనివేశ !)
మావిమ్రా ననఁగను*మామిడిచె ట్టన
నామ్రభూజం బొప్పు*(నభ్ర కేశ !)
అత్తిమ్రానన మేడి*యనఁగ నౌదుంబర
ధారుణీజం బొప్పు*(మేరుచాప !)
యరఁటి యనఁటి నాఁగ*నంశుమత్ఫలధారు
ణీరుహం బగు (ధర*ణీశతాంగ !)

తే. యలరుఁ దుంబీశలాటుస*మాఖ్య లాను
గంబు సొఱకాయ వదరు నా*(గరళకంఠ !)
తా డనంగను దాడినా*తాళభూరు
హంబునకు నాఖ్య లై యొప్పు*(నంబికేశ !.) 6

కొబ్బరి చెట్టు : తెంకాయ చెట్టు, టెంకాయమాను (నారికేళం)
మామిడి చెట్టు : మావి మాను (ఆమ్రభూజం,
మేడి చెట్టు : అత్తి మ్రాను, మేడి (ఔదుంబరధారుణీజం)
అరటి చెట్టు : అరటి, అనటి, (అంశుమత్ఫలధారుణీజం)
ఆనప కాయ : ఆనుగం, సొరకాయ, వదరు(తుంబీశలాటు)
తాటిచెట్టు : తాడు, తాడి (తాళభూరుహం)

సీ. మొక్క మోక నిసువు*మొలక మోసనఁగ నం
కురమునకును బేళ్లు*(కుధరచాప !)
యిగు రనఁ దలిరు నా*జిగురు నాఁ జివురనఁ
బల్లవనామముల్*పరఁగు (నీశ !)
మ్రా ననఁ జెట్టన*మ్రాఁకన భూరుహ
నామధేయము లగు*(వామదేవ !)
పువు పువ్వు పూనాఁగఁ*బుష్పము విరి యల
రనఁ గుసుమాఖ్య లై*యలరు (నీశ !)

తే. గుబురు దట్టము జొంపంబు*గుంపు తఱచు
నాఁగ నిబిడంబు పేళ్లొ ప్పు*(నందివాహ !)
వల్లరిసమాఖ్య లగుచు వ*ర్తిల్లుఁ దీఁగ
తీవ తీవియ తీవె నాఁ*(త్రిపురవైరి !) 7







మొలక : మొక్క, మోక, నిసువు, మోసు (అంకురం)
చిగురు : ఇగురు, తలిరు, చివురు (పల్లవం)
చెట్టు : మాను, మాకు (భూరుహం)
పువ్వు : పువు, పూ, పుష్పము, విరి, అలరు (కుసుమం)
గుబురు : దట్టం, జొంపం, గుంపు,
తరచు (నిబిడం)
తీగ : తీవ, తీవియ, తీవె (వల్లరి)




**ఆ.** అగ్రమున కభిఖ్య*లగుచుండుఁ దుద సుద
కొన యనంగ వృక్ష*కోటరమున
కలరుఁ బేళ్లు తొఱట*తొలి తొఱ్ఱ తొఱ నాఁగ
(నాగహార! రజత*నగవిహార!) 8

కొన : తుద, సుద (అగ్రం)
చెట్టుతొఱ్ఱ : తొఱట, తొలి, తొఱ్ఱ, తొఱ (వృక్ష కోటరం)

**ఆ.** ఇక్షువున కభిఖ్య*లీక్షితిఁ గన్నుల
మ్రాను చెఱకు తియ్య*మ్రా ననంగఁ
దనరు దవ యనంగఁ*దలవాఁడె నాఁగఁ ద
దగ్రమున కభిఖ్య*లగు (గిరీశ!) 9




చెరకు : కన్నులమాను, తియ్యమ్రాను (ఇక్షువు)
**కొన** : దవ, తలవాడె (అగ్రం)

క. అగుఁ బేళ్లుత్పలమునకుం
దొగ తొవ కల్వ గలువనఁగఁ*దోయజ మొప్పుం
దగఁ దమ్మి తామ రనఁగా
మొగ డన మొగ్గ యనఁ దనరు*ముకుళంబు (శివా!)
10




కలువపువ్వు : తొగ, తొవ, కల్వ, కలువ (ఉత్పలం)
**తామరపువ్వు** : తమ్మి, తామర (తోయజం)
**మొగ్గ** : మొగడ (ముకుళం)

**తే.** ఎఱ్ఱఁగుఁ జెందొవ చెందొగ*యెఱ్ఱగలువ
యనఁగ రక్తోత్పలంబు ర*క్తాబ్జ మొప్పు
నిలను గెందమ్మి కెందామ*రెఱ్ఱదామ
రనఁగఁ జెందమ్మి చెందామ*రన (మహేశ!) 11

ఎఱ్ఱకలువ : చెందొవ, చెందొగ (రక్తోత్పలం)
ఎఱ్ఱతామర : కెందమ్మి, కెందామర, చెందమ్మి, చెందామర (రక్తాబ్జం)




క. గొడుగు గొడు వెల్లి యనఁ జె
న్న దరును ఛత్రంబు కేత*నాహ్వయము లగున్
సిడె మనఁగఁ డెక్కె మనఁగాఁ
బడగ యనన్ డా లనంగఁ*(బర్వతధన్వీ!) 12

**గొడుగు :** గొడువు, ఎల్లి (ఛత్రం)
**జండా :** సిడెం, టెక్కెం, పడగ, డాలు (కేతనం)

క. మఱుఁ గనఁగ నోల మనఁగాఁ
మఱు వనఁగా జాటనంగ*మాటన వరుసం
బరఁగు ని వెల్ల నగోచర
ధరణీనామంబు లగుచు*(దర్పకదమనా!) 13

చాటు మరుగు, ఓలం, మరువు
మాటు (అగోచర ధరణి)




క. పొసఁగుఁ దృణాఖ్యలు పులు నాఁ
గస వనఁగాఁ బూరి యనఁగ*గడ్డి యనంగా
వసుమతిలో నెన్నంబడు
ససి సస్సెము పై రనంగ*సస్యం (బభవా!) 14

గడ్డి : పులు, కసవు, పూరి (తృణం)
ధాన్యం : ససి, సస్సెం, పైరు (సస్యం)

తెలుపు రంగు

నలుపు రంగు


ఆ. తెలుపు దెల్ల వెల్ల*తెలి వెలి నాఁగ నా
హ్వాయము లమరు ధవళ*వర్ణమునకుఁ
గప్పు నలుపు నల్ల*కఱ యన నాఖ్యతొ
నీలవర్ణమునకు* (నీలకంఠ!) 15

తెల్ల వెల్ల, తెలి, వెలి (ధవళవర్ణం)
నల్ల ‍ప్పు, కర (నీలవర్ణం)


ఎరుపు రంగు

పసుపు రంగు

ఆ. కెంపు దొగరు దొవరు*గెంజాయ యెఱుపెఱ్ఱ
యనఁగ నరుణకాంతి*కాఖ్య లయ్యె
నళిది పసుపుచాయ*యనఁగ హారిద్రవ
ర్ణమున కాఖ్య లగుఁ (బి*నాకహస్త !) 16

ఎరుపు రంగు : కెంపు, తొగరు, తొవరు, కెంజాయ, ఎర్ర
(అరుణకాంతి)
పసుపు రంగు : అళిది, పసుపు ఛాయ (హారిద్రవర్ణం)

ఆకు పచ్చ రంగు


ఆ. శ్యామవర్ణమునకు*నామంబు లగుచుండుఁ
బసరుచాయ యనఁగ*బచ్చ యనఁగ
వన్నె డాలు రంగు*వన్నియ జిగి జోతి
చాయ యనఁగఁ బఱఁగు*జగతిఁ గాంతి. 17

పచ్చ : పసరు చాయ, (శ్యామ వర్ణం)
కాంతి : వన్నె, డాలు, వన్నియ, జిగి; జోతి, చాయ


మాణిక్యాలు

తే. మానికము లన రతనముల్*నా నెసంగు
నవని మాణిక్యములకు స*మాహ్వయములు
మెఱుఁగనంగను నిగ్గు నా*మెఱయుచుండు
నాఖ్య లుత్కృష్టకాంతికి*(నభ్ర కేశ !) 18

మాణిక్యాలు : మానికములు, రతనములు.
ఎక్కువకాంతి : మెరుగు, నిగ్గు (ఉత్కృష్టకాంతి)




తే. జడధిపేళ్లగు మున్నీరు*కడలి సంద్ర
మనఁగ మడుఁగన మడువు నా*హ్రదము దనరుఁ
బరఁగు నాఱవసంద్రంబు*పాలవెల్లి
జిడ్డుకడలి పాల్కడలి నా*క్షీరజలధి. 19

**సముద్రం :** మున్నీరు, కడలి, సంద్రం (జడధి)
**మడుగు :** మడువు (హ్రదం)
**పాలసముద్రం :** ఆరవసంద్రం, పాలవెల్లి, జిడ్డుకడలి, పాలకడలి (క్షీరజలధి)



**మాగాణి**



**మెట్ట**

క. నంజె యన మడి యనంగను
మంజుల కేదారభూస*మాఖ్యలు వెలయుం
బుంజె యనఁ జేను పొల మనఁ
గంజన మరుభూమి పేళ్లు*(కాయజదమనా). 20

**మాగాణి :** నంజె, మడి (మంజులకేదారభూ)
**మెట్ట :** పుంజె, చేను, పొలం, గంజ (మరుభూమి)

క. ధరణిన్ వివరాఖ్య లగున్
బొఱియ కలుగు లాఁగ బొక్క*బొందయనంగా
దరి యొడ్డు గట్టనంగాఁ
బరఁగుం దీరంబు పేళ్లు*(ప్రమథగణేశా). 21







**కన్నం :** బొరియ, కలుగు, లాగ, బొక్క, బొంద (వివరం)
**తీరం :** దరి, ఒడ్డు, గట్టు




తే. అస లనంగను ఱొంపి నా*నడుసనంగ
బుఱద నా నొప్పుఁ గర్దమం*బునకుఁ బేళ్లు
భూమికి సమాఖ్య లగు బువి*పుడమి నేల
మన్ను పంటవలంతి నా*(మదనదమన !) 22

**బురద :** అసలు, రొంపి, ఆడుసు (కర్దమం)
**పంటభూమి :** బువి, పుడమి, నేల, మన్ను, పంటవలంతి (భూ




తే. జగిలె యనఁగ నరుఁగు నాఁగ * జగతి నాఁగఁ
దిన్నె యన వేదికాఖ్య లై*యెన్నఁ దనరు
మిఱ్ఱనంగను మెరక నా*మిట్ట యనఁగ
నున్న తక్షితి కాఖ్యలై*యొప్పు (నభవ !) 23

అరుగు : జగిలె, జగతి, తిన్నె (వేదిక)
మెరక : మిఱ్ఱు, మిట్ట (ఉన్నతక్షితి)




తే. తనరు నిశ్రేణి తాప ని*చ్చెన యనంగఁ
దెప్ప తేపనునాఖ్యల*నొప్పుఁ బ్లవము
పరఁగు నోడనఁ గలమనఁ*దరణి ధరణిఁ
(దరణిశీతాంశుశిఖినేత్ర !*ధవళగాత్ర !) 24

నిచ్చెన : తాప (నిశ్రేణి)
తెప్ప : తేప (ప్లవం)
ఓడ : కలం (తరణి)

తే. కార్ముకం బొప్పు విల్లు సిం*గాణి యనఁగఁ
దూణ మొప్పు బత్తళిక నా*దొన యనంగఁ
దరకసంబనఁ బొది యనఁ*దనరు శరము
కోల ములి కమ్ము తూఁపు నా*(శూలపాణి!) 25




విల్లు : సింగాణి, ధనుస్సు (కార్ముకం)
పొది : బత్తళిక, దొన, తరకసం (తూణం)
అమ్ము : కోల, ములికి తూపు (శరం)

తే. తనరుఁ బేళ్లు తనుత్రాణ*మునకుఁ గత్త
ళంబు జోడు జిరా దుప్ప*టంబు బొంద
ళంబనఁగ నాఖ్య లగు శతాం*గంబునకును
దేరు నా నరదము నాఁగ*(మేరుచాప !) 26




కవచం : కత్తళం, జోడు, జిరా, దుప్పటం, బొందళం (తనుత్రాణం)
రథం : తేరు,-అరదం (శతాంగం)

క. కన్నా కన్నను దలక
ట్టన్నను మఱి మేలుబంతి*యన్నను ధరలో
నిన్నియు శ్రేష్ఠము పేళ్లై
యెన్నంబడు రాజసభల*(నిభదైత్యహరా!) 27

ప్రశస్తం ; కన్నాకు, తలకట్టు, మేలుబంతి (శ్రేష్ఠం)




క. సొమ్మనఁ దొడ వనఁగా రవ
ణమ్మన నగుఁ బేళ్లు భూష*ణమ్ములకును హా
రమ్ములకు నగును నభిధా
నమ్ములు పేరులన సరులు*నా (శితికంఠా!) 28

అలంకారం : సొమ్ము, తొడవు, రవణం (భూషణం)
అలంకార విశేషాలు : పేరులు, సరులు (హారములు)




తే. సరము లెత్తులు దండలు*సరులనంగ
నామధేయంబు లగుఁ బుష్ప*దామములకు
వాసనకు నాఖ్యలై యొప్పు*వలపు కంపు
తావి కమ్మన యనఁగఁ (గా*త్యాయనీశ!) 29

దండలు : సరములు, ఎత్తులు, సరులు (పుష్ప దామాలు)
వాసన : వలపు, కంపు, తావి, కమ్మన.




క. ఒడమె యన సొమ్మనంగా
విడిముడి యన రొక్క మనఁగ*విత్తంబునకుం
బుడమిని నామము లగు నివి
(యుడు రాజకళావతంస !*యురగాభరణా !) 30

డబ్బు : ఒడమె, సొమ్ము, విడిముడి, రొక్కం (విత్తం)

తే. మచ్చు లన మిద్దె లనఁగను*మాడుగు లన
దారునిర్మితగేహముల్*దనరు చుండుఁ
బరఁగు సౌధంబు మేడ యు*ప్పరిగ యనఁగ
(నాగకేయూర ! మౌనిమా*నసవిహార !) 31







మిద్దె : మచ్చు, మాడుగు (దారునిర్మితగేహం)
మేడ : ఉప్పరిగ (సౌధం)







**తే.** పెట్టె యన మందసంబనఁ*బెట్టె యనఁగఁ
బెట్టియ యనంగఁ బేటికా*భిఖ్య లమరు
మోడనంగను మోటు నా*మొద్దనంగ
వెలయు స్థాణుసమాఖ్యలు*(విశ్వనాథ!) 32

పెట్టె : మందసం, పెట్టె, పెట్టియ (పేటిక)
ఎదుగు బొదుగు లేనిది : మోడు, మోటు, మొద్దు (స్థాణువు)




**ఆ.** విస్తృతాఖ్య లొప్పు*విప్పు,తనర్పు నా
వెడఁద విరివి పఱపు*వెడలు పనఁగ
దీర్ఘమునకు నామ*ధేయంబు లై యొప్పు
నిడుద చాఁపు నిడివి*నిడుపనంగ. 33

వెడల్పు : విప్పు, తనర్పు, వెడద, విరివి, పరపు (విస్తృతం)
పొడవు : నిడుద, చాపు, నిడివి, నిడుపు (దీర్ఘం)

**ఆ.** ఈఁడు దినుసు సాటి*యెన దొర సరి జోడు
సవతు మాద్రి యుద్ది*జత తరంబు
పురుడు నాఁగ సదృశ*మున కివి యాఖ్య లౌ
(వివిధగుణసనాథ!*విశ్వనాథ!) 34

సమానం : ఈడు, దినుసు, సాటి, ఎన, దొర, సరి, జోడు, సవతు, మాద్రి, ఉద్ది, జత, తరం, పురుడు (సదృశం)




**తే.** పసిఁడి బంగరు బంగారు*పైఁడి పొన్ను
జాళువా పుత్తడి యనంగ*స్వర్ణమమరుఁ
దప్తకాంచన మమరుఁ గుం*దన మనం గ
డాని యపరంజి నా (గజ*దానవారి!) 35

బంగారం : పసిడి, బంగరు, బంగారు, పైడి, పొన్ను, జాళువా, పుత్తడి (స్వర్ణం)
మేలిమిబంగారం : కుందనం, కడాని, అపరంజి (తప్తకాంచనం)




**ఆ.** చిదుర తునుక తునియ*చిదురుప వ్రక్క పా
లనఁగ ఖండమునకు*నాఖ్య లమరుఁ
బోగు గుప్ప వామి*ప్రోవు దిట్ట యనంగ
రాశి కాఖ్య లగు (ధ*రాశతాంగ!) 36

ముక్క : చిదుర, తునుక, తునియ, చిదురుప, వ్రక్క, పాలు (ఖండం)
కుప్ప : పోగు, వామి, ప్రోవు, తిట్ట (రాశి)

**క.** ఈ స్థావర వర్గం గడు
నార్థన్ వినఁ జదువ వ్రాయ * నవనీ స్థలిలో
నా స్థాణుని కృప నఖిల శు
భ స్థితులును జనుల కొదవు * భాసుర లీలన్! 37




సింహం : వెడదమోముమెకం, జడలమెకం, ఏనుగులగొంగ, మెకములకొలముసామి, తెల్లడాలుమెకం, తెరనోటిమెకం, సింగం, బొబ్బమెకం (మృగరాజు)

పులి : పసితిండి, మెకములతిండిపోతు, చారలమెకం, ముఠ్వన్నెమెకం (వ్యాఘ్రం)

ఎలుగుబంటు : పుట్టకూడుతిండిపోతు, వెనుకచూపులమెకం, ఎలువ, ఎలుగు, మోరతెలుపుమెకం (భల్లుకం)







క. పలుగొమ్ములమెక మనఁగా
నిల నెక్కుడుమెక మనంగ*నేనుఁ గనంగా
బలువంజమెకము నా జే
గలమెక మన గౌ రనంగఁ*గరి యొప్పు (శివా!) 2

ఏనుగు : పలుకొమ్ముమెకం, ఎక్కుడుమెకం, బలువంజమెకం, చేగలమెకం, గౌరు (కరి)





సీ. వెడఁదమోముమెకంబు*జడలమెకం బేనుఁ
గులగొంగ మెకముల*కొలముసామి
తెల్లడాలుమెకంబు*తెఱనోటిమెకము సిం
గంబు నా బొబ్బమె*కం బనంగఁ
బరఁగును మృగరాజు*పసిదిండి పులి మెకం
బులతిండిపోతు చా*ఱలమెకంబు
ముఠ్వన్నె మెక మన*నివ్వసుంధరయందు
వ్యాఘ్రంబునకు సమా*ఖ్యలు చెలంగుఁ

ఆ. బుట్టకూడుదిండి*పో తన వెనుక చూ
పులమెకంబు నాఁగ*నెలు వనంగ
నెలుఁగునాఁగ మోర*తెలుపు మెకంబు నా
భల్లుకంబు దనరు*(ఫాలనేత్ర !) 1

తే. వాజికి సమాఖ్య లగుఁ దేజి*వారువంబు
మావు గుఱ్ఱంబు తట్టువ*వావురంబు
కత్తలాని బాబా జక్కి*తత్తడి యన
(విగతభవపాశ ! కాశీని*వేశ ! యీశ !) 3

గుఱ్ఱం : తేజి, వారువం, మావు, తట్టువ, వావురం, కత్తలాని, బాబా, జక్కి, తత్తడి (వాజి)




క. తగ రేడిక పొట్టే లన
నగు మేషసమాఖ్య లెనిమి*దడుగులమెక మే
నుఁగుగొంగసూఁ డనంగా
జగతిన్ శరభాఖ్య లొప్పుఁ*(జంద్రార్ధధరా!) 4

గొర్రె : తగరు, ఏడిక, పొట్టేలు (మేషం)
శరభం : ఎనిమిదడుగులమెకం, ఏనుగుగొంగసూడు.

క. నులిగొమ్ములమెక మిఱ్ఱన
నిల మృగమున కొప్పుఁ బేళ్లు*మృగి లేడియనన్
వెలయును రెంటికిఁ దగు నా
ఖ్యలు జింక యనంగ నీశ !*(యంబరకేశా!) 6




మగజింక : నులి గొమ్ముల మెకం, ఇఱ్ఱి జింక, (మృగం)
ఆడ జింక : లేడి. జింక. (మృగి)
ఆడజింక లేక మగజింక : జింక.




క. సంగతి నుష్ట్రాఖ్యలు నొ
ప్పెం గడు నొంటె లన లొట్టి*పిట్ట లనన్ సా
రంగాఖ్య లలరు నిఱ్ఱుల
నంగా జింక లన లేళ్లు*నా (సర్వజ్ఞా!) 5

ఒంటె : లొట్టిపిట్ట (ఉష్ట్రం)
జింక : ఇఱ్ఱి, లేడి (సారంగం)




తే. పసులు తొడుకులు పసరముల్*పసి యనంగఁ
బశువులకును సమాఖ్యలై*పరఁగు నాల
పోఁతు బసవఁడు గిబ్బ యాఁ*బో తనంగ
వృషభమున కాఖ్యలై యొప్పు*(వృషభవాహ !) 7

పశువులు : పసులు, తొడుకులు, పసరాలు, పసి.
ఆంబోతు : ఆలపోతు, బసవడు, గిబ్బ, ఆబోతు (వృషభం).

సీ. తొఱ్ఱుపట్టు లనంగ*దొ డ్లనఁగా నివి
గోష్ఠ దేశమునకుఁ*గొఱలు (నీశ !)
కదుపులు మొదవులు*పదువులు మందలు
నా ధేనుగణ మొప్పు*(నగనివేశ !)
యలరు నాఖ్యలు లేఁగ*లన దూడ లనఁ గ్రేపు
లన వత్సములకును*(ధనదమిత్ర !)
యా వనఁగా గిడ్డి*యనఁ దొడు కన మొద
వన ధేనునామముల్*దనరు (నభవ !)
తే. యుక్షమునకు సమాఖ్యలై*యొప్పుచుండు
గిత్త యె ద్దనఁ గోడె నాఁ*(గృత్తివాస !)
యా లనఁగ ధేనువుల కాఖ్య*యలరు చుండు
శైలజానాథ ! ప్రమథసం*చయసనాథ !) 8







పశువుల శాల : తొఱ్ఱుపట్టులు, దొడ్లు (గోష్ఠ దేశం)
ఆవుల గుంపు : కదువులు, మొదవులు, పదువులు, మందలు,
దూడలు : దూడలు, లేగలు, క్రేపులు, (వత్సములు)
ఆవు : గిడ్డి, తొడుకు, మొదవు (ధేనువు)
ఎద్దు : గిత్త, కోడె, (ఉక్షం)
ఆవులు : ఆలు (ధేనువులు)

తే. అలరుఁ గుందేలుచెవులపో*తనఁగ శశక
మొప్పుఁ బొడలమెకంబు నా*దుప్పి యనఁగఁ
గాఱుకొమ్ములమెక మనం*గను ధరిత్రి
రామనామమృగంబు (ధ*రాశతాంగ !) 9




కుందేలు : చెవులపోతు (శశకం);
దుప్పి : పొడలమెకం, కారుకొమ్ములమెకం (రామనామమృగం)

తే. దుంత యెనుపోతు జమునెక్కి*రింత దున్న
యనఁగ మహిషంబునకు సమా*హ్వాయము లమరుఁ
బరఁగ నెనుపెంట్లు గేదెలు*బఱ్ఱె లెనుము
లనఁగ మహిషీసమాఖ్యలు*(ధనదమిత్ర !) 10




దున్నపోతు : దుంత, ఎనుబోతు, జమునెక్కిరింత, దున్న,
(మహిషం)
గేదె : ఎనుపెంటి, బఱ్ఱె, ఎనుము (మహిషి)

**తే.** పక్కి పులుఁగు పిట్ట యనంగఁ*బక్షి యొప్పు
గఱులు ఱెక్కలు చట్టుప*లెఱక లనఁగఁ
బక్షముల కివి పే ళ్లగుఁ*బర్ణములకు
నాఖ్య లగు లావు లన నీఁక*లనఁగ (నీశ !) 11







పక్షి : పక్కి, పులుగు, పిట్ట.
రెక్కలు : గరులు, చట్టుపలు, ఎరకలు (పక్షములు)
ఈకలు : లావులు (పర్ణములు)




**సీ.** తొలకరికలుగుపు*ల్గులు నల్వ తేజీలు
పాలు నీరును నేరు*పఱుచుపులుఁగు
లంచలు తెల్లిపిట్ట*లన నొప్పు హంసలు
క్రౌంచముల్ ధనరారుఁ*గొంచ లనఁగఁ
గొక్కరా లనఁగను*గొక్కు లనంగను
గొక్కెర లనఁగను*గొంగ లనఁగఁ
బరఁగు నభిఖ్యలు*బకవిహంగములకు
నట్టువపులుఁగు నా*జుట్టుపులుఁగు

**తే.** నాఁగ నె మ్మన నెమిలి నా*నమ్మి యనఁగఁ
గేకికి సమాఖ్య లగుఁ జంచ*రీకములకు
నాఖ్యలు జమిలిముక్కాలి*యనఁగఁ దేఁటి
యనఁగఁ దుమ్మెద నా (నీశ !*యభ్రకేశ !) 12







హంసలు : తొలకరికలుగుపులుగులు, నల్వతేజీలు, పాలునీరునువేరుపరుచుపులుగులు, అంచలు, తెలిపిట్టలు.
కొంచలు : (క్రౌంచములు)
కొంగలు : కొక్కరాలు, కొక్కులు, కొక్కెరలు (బక విహంగం)
నెమలి : నట్టువపులుగు, జుట్టుపులుగు, నెమ్మి, నమ్మి, (కేకి.)
తుమ్మెద : జమిలిముక్కాలి, తేటి (చంచరీకం)

**తే.** పరఁగు నొడ్డీలు కూకీలు*పల్లటీలు
పావురాలును బకదార్లు*పావురములు
నాఁగఁ గలరవపక్షిబృం*దముల పేళ్లు
(పంకజాతాక్షసన్మిత్ర !*ఫాలనేత్ర !) 13




పావురాలు : ఒడ్డీలు, కూకీలు, పల్లటీలు. పారువాలు,
బకదార్లు (కలరవపక్షి బృందం)




**తే.** పుడమిలోపలఁ జదువుల*పులుఁ గనంగఁ
జిగురువిల్కానితేజి నాఁ*దొగరుముక్కు
పులుఁ గనఁగఁ బచ్చఱెక్కల*పులుఁ గనంగఁ
జిలుక యన నొప్పుఁ గీరంబు*(శ్రీమహేశ !) 14

చిలుక : చదువులపులుగు, చిగురువిలుకానితేజీ ,
తొగరుముక్కుపులుగు, పచ్చరెక్కలపులుగు

**తే.** బట్టికాఁ డన గొరవంక*పిట్ట యనఁగఁ
బరఁగు శారిక యేట్రింత*పసులపోలి
గాఁడు కూఁకటిమూఁగ నాఁ*గను జెలంగు
నిల భరద్వాజవిహగంబు*(నీలకంఠ !) 15




గోరువంక : బట్టికాడు, గొరవంకపిట్ట, (శారిక.)
ఏట్రింత : పసులపొలికాడు, కూకటిమూగ (భరద్వాజపక్షి);)




**తే.** జాలె డే గనఁ గురుజు నా*సాళ్వమనఁగఁ
గణుజు నాఁగను జలకట్టె *యనఁగ వేస
డం బనఁగ గిద్దు నా నోర*ణం బనంగ
శ్యేనభేదంబు లగు (మహా*సేనజనక !) 16

డేగ : జాలె, కురుజు, సాళ్వం , కణుజు, జలకట్టె, వేసడం, గిద్దు,
ఓరణం, (శ్యేన భేదం, గద్దలలో ఒక తెగ.)

తే కోటఁ దనఁగను గూబ నా*ఘూక మమరుఁ
జిఱుతగూబ యనంగఁ బ*సిండికంటి
యనఁగ సకినాలపులుఁ గన*నలరుచుండుఁ
బృథివిఁ గనకాక్షి యనుపక్షి*(శ్రీమహేశ!) 17



గుడ్లగూబ

గుడ్లగూబ : కోటడు, గూబ (ఘూకం)

చిరుతగూబ : పసిడికంటి, సకినాలపులుగు (కనకాక్షి)

తే. పాము సప్పంబు నిడుపఁడు*పడగదారి
గాలిమేఁతరి విసదారి*కానరాని
కాళ్ల యది చిల్వ వీనుల*కంటి పుట్ట
పెట్టి ప ట్టనఁ జను నహి*పేళ్లు (భర్గ!) 18



చిల్వ



పాము

పాము : సప్పం, నిడుపడు, పడగదారి, గాలిమేతరి, విసదారి, కానరానికాళ్లయది, చిల్వ, వీనులకంటి, పుట్టపెట్టిపట్టు(అహి.)

క. ఇల నెంచ రుధిరమున కా
ఖ్యలు నల్ల యనంగ నెత్తు*రనఁగ ధరిత్రిం
బొల యీరు వెఱచి నంజుడు
పొల సన నివి పరఁగు మాంస*మునకు(మహేశా!)
19




రక్తం : నల్ల, నెత్తురు (రుధిరం.)

మాంసం : పొల, ఈరువు, ఎరచి, నంజుడు, పొలసు.

క. భర్గుఁడు కాశీనిలయుఁడు
దుర్గాపతి యొసఁగు ముదము*తో నీతిర్య
గ్వర్గు లిఖించినఁ జదివిన
దౌర్గత్యము లణఁచి సంప*దలు నిత్యంబున్. 20




క. కలు పనఁ బే రగు దధికిం
గలు పన సస్యంబులోని*గాదముపే రౌ
వెలు గంద్రు కంపకోటను
వెలుఁ గందురు ప్రభను జనులు*(విశ్వాధిపతీ !) 1

కలుపు : 1. పెరుగు (దధి), 2 సస్యంలోనిగాదం.
వెలుగు : 1. కంచె (కంప కోట), 2. వెలుతురు,(ప్రభ).

క. ఇమ్మహిలోపలఁ బే రగుఁ
గొమ్మ యనన్ వృక్షశాఖ*కును భామినికిం
దమ్ము లనం బే రగుఁ బ
ద్మమ్ముల కనుజన్ములకును*(దరుణేందుధరా!) 3




కొమ్మ : 1. చెట్టు కొమ్మ (వృక్ష శాఖ), 2. స్త్రీ(భామిని).
తమ్ములు : 1. తామరలు (పద్మాలు), 2. తమ్ముళ్లు (అనుజన్ములు




క. మావు లనం దగు హయములు
మావు లనం బరఁగు నామ్ర*మహిజంబు లిలం
దావు లన స్థల మొప్పును
దావు లనన్ వాసనలకుఁ*దగుఁ బేరు (శివా!) 2

మావులు : 1. గుర్రాలు (హయాలు), 2. మామిడిచెట్లు
(ఆమ్రమహీజాలు)
తావులు : 1. స్థలాలు, 2. వాసనలు




క. ఇమ్ములఁ బే రగుఁ దాటం
కమ్ములకున్ లేఖలకును*గమ్మ లనన్ నా
మమ్ము దగుం గంఠాభర
ణమ్మునకును లతకుఁ దీఁగె*నా (గౌరీశ) 4

కమ్మ : 1. చెవికమ్మ, (తాటంకం), 2. జాబు (లేఖ).
తీగె : 1. మెడనూలు (కంఠాభరణం), 2. తీగ లత.

క. చెల్లును బేళ్లై ధరలోఁ
దా ళ్లనఁ సూత్రంబులకును*దాళంబులకుం
గో ళ్లనఁ గుక్కుటములకును
బేళ్లగు ఖట్వాంగములకుఁ*బేళ్లగు (నభవా!) 5




తాళ్లు : 1. పగ్గాలు (సూత్రాలు), 2. తాటిచెట్లు (తాళములు)
కోళ్లు : 1. కుక్కుటాలు, 2. మంచపుకోళ్లు (ఖట్వాంగాలు)

క. చామ యన సస్యమునకును
భామినికిని నాఖ్య యగుచుఁ*బరఁగు ధరిత్రిన్
నామము లగుచును వెలయును
బాము లనన్ జన్మములకు*భంగమ్ములకున్. 6




చామ : 1. ఒక సస్యం, 2. స్త్రీ (భామిని)
బాము : 1. జన్మ, 2. భంగం.




తే. దంట యనఁగ నభిఖ్య యై*దనరుచుండు
జగతిలోపలఁ బ్రౌఢకు*యుగళమునకుఁ
బఱ పనంగ నభిఖ్య యౌఁ*బానుపునకు
విస్తృతమునకు (శైలని*వేశ యీశ). 7

దంట : 1. ప్రౌఢ, 2. జంట (యుగళం)
పరుపు : 1. పానుపు, 2. విస్తృతం.







క. తొలి యనఁగా నగు నామం
బులు పూర్వంబునకు సుషిర*మునకును ధరలో
వెలి యనఁగ బహిర్ధవళం
బులకును నామంబు (శేష*భుజగవిభూషా!) 8

తొలి : 1. మునుపు (పూర్వం), 2. బెజ్జం (సుషిరం).
వెలి : 1. బయటి (బహిః), 2. తెల్లని (ధవళం)




క. నెమ్మి యనన్ వంజులవృ
క్షమ్మనకున్ బర్హికిని సు*ఖస్థితికిని నా
మమ్మగుఁ దగు (నతిధీర య
హమ్మతిజనదూర పన్న*గాధిపహారా!) 9

నెమ్మి : 1. ప్రబ్బలి చెట్టు (వంజుల వృక్షం), 2. నెమలి (బర్హి),
3. సుఖస్థితి.




క. పొలం బే రగుచుండును
బా లనఁగా క్షీరమునకు*భాగంబునకుం
గా లనఁ బే రగు నాలవ
పాలికిఁ బాదంబునకును*(బాలేందుధరా!) 10

పాలు : 1. క్షీరం, 2. భాగం.
కాలు : 1. నాలుగోపాలు, 2. పాదం.

క. మే లన శుభంబు పే రగు
మే లన నుపరికిని గూరి*మికినిం బేరౌ
మే లన మెచ్చునఁ బల్కిన
యాలాపంబునకు నాఖ్య*యగు (జగదీశా!) 11

మేలు : 1. శుభం, 2. పైన (ఉపరి) 3. కూరిమి, 4. మెప్పుమాట,

పలికిన మెచ్చున ఆలాపం.

క. ధారుణిఁ బేరు వహించును
బూరుగు నా నూఁదువాద్య*మును శాల్మలియుం
బే రన నభిధానం బగు
హారమునకు నామమునకు*(నంబరకేశా!) 12




బూరుగు : 1. ఊదు వాద్యం, 2. శాల్మలి.
పేరు : 1 దండ (హారం,)2. నామం.

క. క ప్పన నీలిమ పే రగుఁ
గ ప్పనఁగా నింటిమీఁది*కసవుకుఁ బేరౌఁ
గొ ప్పనఁ దగుఁ జాపాగ్రము
నొ ప్పగు ధమ్మిల్లమును గృ*హోపరియు (శివా!)
13




కప్పు : 1,నల్లదనం, నీలిమ, 2. ఇంటి మీది కసవు.
కొప్పు : 1.వింటి కొన (చాపాగ్రం), 2.జుట్టుముడి, (ధమ్మిల్లం)
3. ఇంటి పై భాగం (గృహోపరి)




క. ఒకభూరుహమునకును ధమ
నికిఁ బే రగుఁ గ్రోవి యనఁగ*నెఱినట్టుల వే
ఱొకభూరుహమునకు నధరము
నకుఁ బే రగు మోవి యనిన*(నగరాట్చాపా!) 14

క్రోవి : 1. ఒకచెట్టు, (భూరుహం) 2. ధమని
మోవి : 1. ఒక చెట్టు (భూజం), 2. కింది పెదవి (అధరం).







క. చవు లనఁగా నభిధానము
లవు షడ్రుచులకును ముత్తి*యపుటెత్తులకున్
భువిలోపల నామము లగు
గవులన గుహలకునుఁ బూతి*గంధంబులకున్. 15

చవి : 1. రుచి, 2. ముత్తియపు టిత్తు
గవులు : 1. గుహలు, 2(పూతిగంధం) కంపు.

తే. ఆఖ్య యై యొప్పు ధరణిలో*నపరదివస
మునకు ఛత్రంబునకు నెల్లి*యనెడినుడువు
జక్కి యనుపేరుపరఁగును*సైంధవంబు
నకు ఘరట్టంబునకును (గం*దర్పదమన !) 16




ఎల్లి : 1. రేపు (అపర దివసం), 2. గొడుగు (ఛత్రం)
జక్కి : 1. గుర్రం (సైంధవం), 2. తిరగలి (ఘరట్టం)

తే. ఆడె ననుమాట నటియించె*ననుటకును వ
చించె ననుటకు మఱియు నిం*దించె ననుట
కాఖ్య యగుచును శోభిల్లు*నాలు నాఁగ
గోవులకు భార్యకును బే ర*గు (న్మహేశ !) 17







ఆడు : 1. నటించు, 2. పలుకు (ఎచించు) 3. తిట్టు.(నిందించు)
ఆలు : 1. గోవులు, 2. భార్య.

సీ. రజతపునఃపదా*ర్థములకు నభిధాన
మగు వెండి యన బంతి* యనఁగఁ గందు
కమునకు శ్రేణికి*నమరు నాహ్వయముగా
దండ యనం బుష్ప*దామమునకు
నంతికంబునకుఁ బే*రగు దొర యన నాఖ్య
యగు సదృశమునకు*నవనిపతికి
నష్ట సంఖ్యకు నహ*మ్మనుటకు నాహ్వయం
బగు నే ననఁగ సరి*యనఁగ సదృశ

తే. మునకు సమసంఖ్యకును నామ*ముగ నెసంగు
గొంతనఁగ నాహ్వయంబగుఁ*గుక్కుటాస
నంబునకుఁ గంఠంబునకును*నల్ల యనిన
రక్తనీలాఖ్య యై యొప్పు*(రాజమకుట !) 18



















సీ. తీరంబునకు ధరి * త్రీధరంబునకు స
మాఖ్య యై యొప్పు గ*ట్టనఁగ (నీశ !)
కేతువునకుఁ గాంతి*కిని సమాహ్వయ మగు
డా లనంగను (మేరు*శైలచాప !)
శౌర్యధుర్యునకు లాం*ఛనమునకును నామ
మగు బిరు దనఁగఁ (బ*న్నగవిభూష !)
గూబ నా నాఖ్య యౌ*ఘూకంబునకుఁ గర్ణ
మూలంబునకు (నవి*ముక్తనిలయ !)

తే. యంతికంబునకును సమూ*హంబునకును
నామ మై యొప్పుఁ జేరువ*నాఁగ (నభవ !)
సమభిధాన మై యొప్పుఁ బి*శాచమునకుఁ
బవనమునకును గాలి య*న్నలుకు (రుద్ర !) 19

**వెండి :** 1. రజతం, 2. తిరిగి (పునః)
**బంతి :** 1. కందుకం, 2. వరుస (శ్రేణి).
**దండ :** 1. పుష్ప దామం, 2. సమీపం (అంతికం).
**దొర :** 1. సమానం (సదృశం), 2. రాజు (అవనిపతి)
**ఏను :** 1. అయిదు (అష్టసంఖ్య), 2. నేను (అహం)
**సరి :** 1. సమానం (సదృశం), 2. సమ సంఖ్య.
**గొంతు :** 1. కుక్కుటాసనం, 2. మెడ (కంఠం)
**నల్ల :** 1. నెత్తురు (రక్తం), 2. నలుపు (నీలం).

**గట్టు :** 1. తీరం, 2. పర్వతం (ధరిత్రీధరం)
**డాలు :** 1. జెండా (కేతువు), 2. కాంతి
**బిరుదు :** 1 వీరుడు, శౌర్య ధుర్యుడు, 2. గుర్తు (లాంఛనం)
**గూబ :** 1. గుడ్లగూబ (ఘూకం), 2. చెవిమొదలు (కర్ణమూలం).
**చేరువ :** 1. దగ్గర (అంతికం) 2. గుంపు (సమూహం)
**గాలి :** 1. దయ్యము; పిశాచం 2. వాయువు.

క. ఇలలోపల నామం బగుఁ
బలుకులు నా శకలములకు*భాషణములకున్
నెల యన నభిధామం బగు
జలజారికి మాసమునకు*(శైలనిశాంతా!) 20

**పలుకు :** 1 ముక్క (శకలం), 2 మాట (భాషణం)
**నెల :** 1. చంద్రుడు (జలజారి), 2. 30 రోజులు (మాసం)




సీ. అంతర్హితుం డయ్యె*ననుటకు నాగతుం
డయ్యె ననుటకు స*మాఖ్య యగుచు
నలరును విచ్చేసె*ననుట (యంబరకేశ!)
నెఱి సమాహ్వాయ మగుఁ*గఱచె ననఁగ
నభ్యాస మొనరించె*ననుటకు దంతపీ
డ యొనర్చె ననుటకు*(నయుగనయన!)
వెలయుఁ దప్తక్షీర*ములకు నభిజ్ఞకు
నాఖ్యయై యానవా*లనుట (యీశ!)

తే. పఱచె ననఁగ సమాఖ్యయౌ*బాధచేసెఁ
బ్రచలితుం డయ్యె ననుటకుఁ*(బాండురాంగ!)
పరఁగ మోహించె ననుటకుఁ*బరిమళించె
ననుట కొప్పును వలచెనా*(నళికనేత్ర). 21

**విచ్చేయు :** 1. అంతర్హితుడగు, 2. ఆగతుడగు
**కరచు :** 1 నేర్చు, అభ్యాసమొనర్చు. 2. పళ్ళుకొరుకు, దంత పీడనమొనరించు.
**ఆనవాలు :** 1. కాగిన పాలు (తప్తక్షీరం). 2. గుర్తు (అభిజ్ఞ)
**పరచు :** 1. (బాధ చేయు), 2. ప్రయాణమగు ప్రచలితుడగు.
**వలచు :** 1 కోరు. మోహించు, 2. సువాసన ఇచ్చు, పరిమళించు.

సీ. అనె నంట సమాఖ్య*యౌను వహించెఁ బా
నము చేసె ననుటకు*(నగనివేశ!)
చషకంబునకును దం*ష్ట్రకు నాఖ్య యౌఁ గోర
యనఁగ (శశాంకక*ళావతంస)
మొక్కలీఁ డనఁగఁ గొ*మ్ములు లేనికరికి ము
ష్కరునకుఁ బే రగు*(గరళకంఠ!)
మరకతచ్ఛవికి నం*బరమున కగుఁ బేరు
పచ్చడం బనిన (నం*బాకళత్ర!)

తే. క్షితిని దురగీపతికి వృత్త*శిలకు నామ
ధేయ మై యొప్పు గుండు నాఁ*(త్రిపురహరణ!)
నామ మౌ నొక్కసస్యంబు*నకును లోప
మునకుఁ గొఱ్ఱ యనంగ (నం*బుదనిభాంగ!) 22




**అను :** 1. మోయు(వహించు), 2 తాగు (పానముచేయు)
**కోర :** 1. గిన్నె (చషకం), 2. పెద్దపన్ను (దంష్ట్ర)
**మొక్కలీడు :** 1. కొమ్ములు లేని ఏనుగు, 2 మూర్ఖుడు (ముష్కరుడు)
**పచ్చడం :** 1. పచ్చల కాంతి (మరకతచ్ఛవి), 2. పైగుడ్డ, వస్త్రం (అంబరం)
**గుండు :** 1. మగ గుర్రం (తురగీ పతి), 2. గుండ్రని బండ (వృత్త శిల)
**కొఱ్ఱ :** 1. ఒక సస్యం, 2. కొరవ (లోపం)

సీ. తాల్చు నాఖ్యను వధూ*ధమ్మిల్లభారంబు
గోణంబు మూల నా(*(గుధరచాప !)
గొఱ యనునాఖ్యచే(*గొఱలు లోపంబు మ
నోజ్ఞ వస్తువు (దక్ష*యజ్ఞమథన !)
నెఱి హేయపడియె న*న్వేషించె నను రెంటి
కాఖ్య యౌ రోసె నా*(నసితకంఠ)
నరసె నా( బే రగు*నార్తి వారించె వి
మర్శించె ననుటకు*(మదనదమన !)

తే. చరణమునకు నధఃప్రదే*శంబునకు స
మాఖ్యయై యొప్పు నడుగు నా*(నళికనేత్ర !)
మహిని బే రగు చుండు( బ్ర*మాణికంబు
నకును భాషకు బాస నా*(నగనివేశ !) 23



















సీ. నాగవాస మన ఘం*టాప్రతీకమునకు
వేశ్యల కగు( బేరు*(విశ్వనాథ !)
నామ మౌ నండంబు*నకు నంధకునకును
గ్రుడ్డనంగను (రౌప్య*కుధరనిలయ !)
చర్మవాద్యమున కు*ష్ణ మునకు( బే రగు
నుడు కనియెడునాఖ్య*(యుడుపమకుట !)
యభిధాన మగు మేడి*యన హలాంగమున కు
దుంబరమునకును*(ధూతకలుష !)

తే. క ల్లన(గ శిల సురయు నౌ*(గరళకంఠ !)
పర(గు నాఖ్యయు లాంగల*పద్ధతికిని
శ్రేణికిని జా లనంగ (భా*సితసితాంగ !)
(వారిధినిషంగ ! కాశీని*వాసలింగ !) 24

**మూల** : 1. స్త్రీ కొప్పు (వధూధమ్మిల్లం), 2. కోణం

**కొర** : 1. కొఱ్ఱలను ధాన్యం, 2. లోపం, 3. (మనోజ్ఞ వస్తువు)

**రోయు** : 1. అసహ్యించుకొను (హేయపడు), 2. వెదకు (అన్వేషించు)

**అరయు** : 1. దుఃఖంపోగొట్టు, ఆర్తి వారించు, 2. విమర్శించు

**అడుగు** : 1. పాదం, 2. క్రింది భాగం

**బాస** : 1. ఒట్టు (ప్రమాణికం.) 2. భాష

**నాగవాసం** : 1 గంటలోని సీల (ఘంటా ప్రతీకం), 2. వేశ్యలు.

**గుడ్డు** : 1. అండం, 2. గుడ్డివాడు (అంధకుడు)

**ఉడుకు** : 1. ఒక వాద్యం (చర్మవాద్యం), 2. వేడిమి (ఉష్ణం)

**మేడి** : 1. నాగలి వెనుక పట్టు కొయ్య (హలాంగం), 2. అత్తి చెట్టు (ఉదుంబరం)

**కల్లు** : 1. రాయి (శిల), 2. మద్యం (సుర)

**చాలు** : 1. నాగేటిచాలు (లాంగల పద్ధతి), 2. వరుస (శ్రేణి)




**తే.** జననికిని మాతృజననికి*జనకజనని
కాఖ్య యగు నవ్వ యనఁగ (నా*ర్యాసహాయ !)
భగినికిని జనకునకు నా*హ్వయము దనరు
నప్ప యనఁగను (జంద్ర రే*ఖావతంస !) 25

**అవ్వ :** 1. తల్లి (జనని), 2. తల్లి తల్లి (మాతృ జనని), 3. తండ్రి తల్లి (జనక జనని).

**అప్ప :** 1. అక్క (భగిని), 2. తండ్రి (జనకుడు)




క. పో తనఁగఁ బరఁగు మహిషము
భూతలమునఁ బురుషమృగమ్ము*బురుష ఖగంబుం
దా తన ధాత్రు పితామహ
మాతామహులకును నగు స*మాఖ్య (మహేశా!) 26

**పోతు :** 1. దున్నపోతు (మహిషం). 2. పురుష మృగం, 3. మగ పక్షి (పురుష ఖగం)

**తాత :** 1. బ్రహ్మ, 2. తండ్రి తండ్రి (పితామహుడు), 3. తల్లి తండ్రి (మాతామహుడు)

క. పుడమిని బేరు వహించును
వడిగలవాఁ డనఁగ శౌర్య*వంతుఁడు జవియున్
నడు మన నవలగ్నముఁ జె
న్నడరఁగ మధ్యస్థలంబు*నగు (నగధన్వీ !) 27




**వడిగలవాడు :** 1. వీరుడు, శౌర్యవంతుడు 2. చురుకైనవాడు (జవి)

**నడుము :** 1. మధ్యము (అవలగ్నం), 2. నడిమిచోటు/ మధ్యస్థలం.

క. ఎద యనఁగఁ బరఁగు భీతికి
హృదయమునకు వక్షమునకు*నిల జో డనఁగా
నది దనరు నామ మగుచును
సదృశమునకు వర్మమునకుఁ*(జంద్రార్ధధరా!) 28




**ఎద :** 1. భయం (భీతి), 2. ఎడద/ హృదయం, 3. రొమ్ము (వక్షం)

**జోడు :** సమానం (సదృశం), 2. కవచం (వర్మం).

క. నానార్థవర్గు విది స
న్మానముతో దీనిఁ జదివి*నను వ్రాసిన నా
మానవుల కబ్బు నెప్పుడు
నానార్థంబులును విశ్వ*నాథునికరుణన్. 29

గద్యము. ఇది శ్రీమదేకామ్రమంత్రిపుత్ర కౌండిన్యగోత్రపవిత్ర, సదారాధిత మహేశ్వర పైడిపాటి లక్ష్మణకవి ప్రణీతంబైన యాంధ్రనామసంగ్రహం బను నిఘంటువునందు సర్వంబు నేకాశ్వాసము.



క. శ్రీ గౌరీ ప్రియవల్లభ
రాగద్వేషాదిరహిత!*రమ్యచరిత్రా!
యోగిధ్యేయపదాంబుజ!
భోగివలయ! రామచంద్ర*పురవరనిలయా! 1

వ. అవధరింపుము : 2

ఆ. ఆంధ్రనామసంగ్ర*హమునందుఁ జెప్పని
కొన్ని తెలుఁగు మఱుఁగు*లన్నిఁగూర్చి
యాంధ్రనామశేష*మను పేరఁ జెప్పెద
దీనిఁ జిత్తగింపు*దేవదేవ! 3

క. తఱి య జ్జద నన సమయం
బుఱఁ డనఁగను సరకుసేయ*కుండె నసఁగఁ బే
ళ్లొఱ పగు గణింపఁ డనుటకుఁ
(గరిచర్మాంబర! త్రినేత్ర!*గౌరీమిత్రా!) 4

అదను : తరి, అజ్జ, సమయం
లక్ష్యపెట్టడు : ఉరడు, సరకుసేయడు (గణింపడు)

తే. పెంపుసెందెను దామర*తంపరయ్యెఁ
బ్రబలె నెగడెను గొనసాగె*బలిసె పెరిఁగె
నసఁగ రేకెత్తె నసఁగ బే*ళ్లయ్యె వృద్ధి
బొందె ననుటకు (శేషాహి*భూషితాంగ!) 5

పెరుగు : పెంపుచెందు, తామరతంపరగు, ప్రబలు, నెగడు,
కొనసాగు, బలియు, రేకెత్తు (వృద్ధిపొందు)

తే. పేర్మి యర్మిలి మక్కువ*కూర్మి నెమ్మి
నెనరు గాదిలి గారాము*నెయ్య మింపు
ప్రేముడి యనుంగు ముద్దనఁ*బ్రియమునకును
నామధేయంబు లయ్యెఁ (బి*నాకపాణి!) 6

ప్రేమ : పేర్మి, అర్మిలి, మక్కువ, కూర్మి, నెమ్మి, నెనరు, గాదిలి,
గారాము, నెయ్యం, ఇంపు, ప్రేముడి, అనుగు, ముద్దు
(ప్రియం)

క. ఒనఁగూర్చె నసఁగ సమకూ
ర్చె ననన్ వీల్పఱిచె ననఁగఁ*జేకూర్చెను నా
ననుకూలపఱిచె ననుటకుఁ
దనరును నామంబు లై (సు*ధాకరమకుటా!) 7

సమకూర్చు : ఒనగూర్చు, వీల్పరుచు, చేకూర్చు (అనుకూలపరచు)

క. చరియించె ననుట కాఖ్యలు
తిరిగెను జెరలాడె ననఁగఁ*ద్రిమ్మరె ననఁ గ్రు
మ్మరె ననఁగ మసలె ననఁగాఁ
(బురదానవహరణ! శేష*భుజగాభరణా!) 8

తిరుగు : చెరలాడు, త్రిమ్మరు, క్రుమ్మరు, మసలు (చరియించు)

తే. ఆఱుమూఁడయ్యెఁ గచ్చువి*చ్చయ్యె ననఁగ
బెడిసె బుసిపోయె ననఁగను*జెడియెననఁగ
నాఖ్య లగుఁ గార్యవైకల్య*మయ్యె ననుట
(కంధకాసురహరణ! రౌ*ప్యాద్రిశరణ!) 9

చెడు : ఆరుమూడగు, కచ్చువిచ్చగు, బెడియు, బుసిపోవు,
చెడు (కార్యవైకల్యమగు)

క. అలజడి నెంజిలి పిమ్మట
సిలు గుత్తలపాటు వంత*సేగి నెగుల్ గొం
దల మలమ టడరు గో డు
మ్మలిక వనటఁ గుందు నా న*మరు దుఃఖాఖ్యల్ 10

దుఃఖం : అలజడి, నెంజిలి, పిమ్మట, సిలుగు, ఉత్తలపాటు, వంత,
సేగి, నెగులు, కొందలం, అలమట, అడరు, గోడు,
ఉమ్మలిక, వనట, కుంచు

క. అరిది వెఱఁ గచ్చెరు వ
బ్బుర మబ్రం బనఁగఁ జిత్ర*మునకుం బేళ్లౌ
సరణికిఁ బే ళ్లగుఁ దో వనఁ
దెరు వన దారి యన బాట*తె న్నన (నభవా!) 11

ఆశ్చర్యం : అరిది, వెరంగు, అచ్చెరువు, అబ్బురం, అబ్రం (చిత్రం)
దారి : తోవ, తెరువు, బాట, తెన్ను (సరణి)





తే. ఐదుపదిచేసె వెనుకముం*దయ్యె జాఱెఁగె
వీఁగె వెన్నిచ్చె వెనుకంజ*వేసె ననఁగ
నోహటించె ననంగఁ బే*ళ్లొప్పుచుండు
నాహవపరాఙ్ముఖుం డయ్యె*ననుట (కభవ !) 12

వెనుకంజవేయు : ఐదుపదిచేయు, వెనుక ముందగు, జాఱుగు,
వీగు, వెన్నిచ్చు, ఓహటించు
(ఆహవపరాఙ్ముఖుడగు)

తే. మోహరించెనుదండెత్తె *మొనసె దాడి
చేసెఁ బోటొగ్గెఁ గోల్తలు*చేసె మాఱు
కొనియె దళమెత్తె ననఁగఁ బే*ళ్లొనరుచుండు
నాహవోద్యోగ మొనరించె*ననుట (కభవ!) 13

యుద్ధప్రయత్నంచేయు : మోహరించు, దండెత్తు, మొనయు,
దాడిచేయు, పోటొగ్గు, కోల్తలు చేయు,
మారుకొను, దళమెత్తు
(ఆహవోద్యోగమొనరించు)

తే. ఆహవోన్ముఖతకు నోల*మాసగొనక
పిఱుతివియ కీడఁబో కనఁ*బేళ్లు దనరు
నబ్బెసమొనర్చెఁ గఱచెనా*నభ్యసించె
ననుట కభిధానములు (చంద్ర*మావతంస!) 14

యుద్ధానికిసిద్ధమగు : ఓలమాసగొనక, పిరుతివియక, ఈడబోక
(ఆహవోన్ముఖమగు)

నేర్చుకొను : అబ్బెస మొనర్చు, కరచు (అభ్యసించు)

క. వేఱొక టనఁ బైపెచ్చన
మాఱట యిమ్మడి యనన్ స*మాహ్వయములు పెం
పారును వస్త్వంతరమున
(కౌరగకేయూరసహిత*హత! మారజితా!) 15

వేరొకటి : పైపెచ్చు, మారట, ఇమ్మడి (వస్త్వంతరం)

సీ. ఆఱడిపోయెను*బీఱువోయెను రిత్త
వోయెను వీసర*వోయె ననఁగ
నుడివోయెఁ బొలివోయె*సుడివోయె ననఁగను
వ్యర్థ మయ్యె నటంట*కాఖ్య లయ్యెఁ
గడిమి బీరంబు మ*గంటిమి గం డన
విక్రమాహ్వయములై*వెలయుచుండు
నాస్ఫాలన మొనర్చె*ననుటకుఁ జఱచెనా
నప్పళించె ననంగ*నాఖ్య లయ్యె

తే. నొగి వరుస యోలి సొరిది నా*నోజ నాఁగఁ
గ్రమమునకు నాఖ్య లయ్యెను*(గాలకంఠ!)
కొఱ కొఱఁత తక్కువ వెలితి*కొదవ కడమ
యనఁగ నూనంబునకు నాఖ్య*లై తనర్చు: 16

వ్యర్థమగు : ఆరడిపోవు, బీరుపోవు, రిత్తపోవు, వీసరపోవు,
ఉడిపోవు, పొలిపోవు, సుడిపోవు.

పరాక్రమం : కడిమి, బీరం, మగటిమి, గండు (విక్రమం)

చరచు : అప్పళించు (ఆస్ఫాలన మొనర్చు)

వరుస : ఒగి, ఓలి, సొరిది, ఓజ (క్రమం)

తక్కువ : కొర, కొరత, వెలితి, కొదవ, కడమ (ఊనం)

తే. నెట్టుకొనెఁ బొలుపడె నొడి*గట్టె ననఁగఁ
గడఁగెఁ దొడఁగెను జెలరేగెఁ*గాలుద్రొక్కెఁ
గవిసెఁ గదిసె ననంగ నా*ఖ్యలయి యొప్పు
నభిముఖుం డయ్యె ననుటకు*(నగనివేశ!) 17

పూనుకొను : నెట్టుకొను, పొలుపడు, ఒడిగట్టు, కడగు, తొడగు,
చెలరేగు, కాలుతొక్కు, కవియు, కదియు
(అభిముఖుడగు)

తే. అగపడకపోయె విచ్చు మొ*గ్గయ్యె ననఁగఁ
గంటఁబడదయ్యెఁ బంచబం*గాళమయ్యె
ననఁగ దృగగోచరం బయ్యె*ననుట పేళ్లు
(శయఘటితశూల! వైయాఘ్ర*చర్మ చేల!) 18

కనపడకపోవు : అగపడకపోవు, విచ్చుమొగ్గగు, కంటపడకపోవు
పంచబంగాళమగు (దృగగోచరమగు)





క. వెలిచవి చీఁకటితప్పనఁ
బొలుపారఁగ జారభావ*మునకుం బేళ్లౌఁ
బులు కసటు చిలు మనంగను
మలిన మనుట కాఖ్య లయ్యె*(మనసిజదమనా!)
19

**వ్యభిచారం** : వెలిచవి (జారభావం)
మలినం : పులు, కసటు, చిలుము.

**ఆ.** వింగడం బనంగ*విపరీత మగు నుక్కి
వం బనఁగను గుత్సి*తంబు పరఁగు
నాఖ్య యగుచుఁ దనరు*నామని యనఁగను
మదమునకును (జంద్ర*మఃకలాప!) 20

విపరీతం : వింగడం
**కుత్సితం :** ఉక్కివం
**మదం :** ఆము

క. ఎల యండ్రు తరుణ మనుటకుఁ
గొల యన దురితంబు పేరు*కుడియెడమ లనన్
వలపలదాపల లనఁగను
బొలుపుగ నపసవ్యసవ్య*ములకుం బేళ్లౌ. 21

యౌవనం : ఎల (తరుణం)
పాపం : కొల (దురితం)
**కుడియెడమలు :** వలపలదాపలలు (అపసవ్యసవ్యములు).

క. తగు నౌద్ధత్యము పేళ్లై
పొగ రన నా మనఁగఁద్రుళ్లు*పోతర మనఁగా
నెగడును భయంబుపేళ్లై
బెగడు దిగులు వెఱపు జంకు*బీ తలు కనఁగన్.
22

**పొగరు :** , ఆము, తుళ్లు, పోతరం (ఔద్ధత్యం)
**భయం :** బెగడు, దిగులు, వెరపు, జంకు, బీతు, అలుకు.

క. అరి యనఁ గప్పం బనఁగాఁ
గరమునకుం బేళ్లు కాఁగు*కడవ పనఁటి నాఁ
బరఁగు ఘటాఖ్యలు (నమితా
మరమౌనినికాయ! భూతి*మండితకాయా!) 23

పన్ను : అరి, కప్పం (కరం)
**కుండ :** కాగు, కడవ, పనటి (ఘటం)

**తే.** అలరుచుండును గొండ్లి రం*తనఁగఁ గేళి
హాని కాఖ్యలు చేటు కీ*డఱ యనంగ
హెచ్చరిక హోళి సంతసం*బెలమి వేడ్క
యనఁగ నానందమున కాఖ్య*లై తనర్చు 24

**ఆట :** గొండ్లి, రంతు (కేళి)
హాని : చేటు, కీడు, అర
**ఆనందం :** హెచ్చరిక, హోళి, సంతసం, ఎలమి, వేడ్క.

క. సాహిణ మనఁ బాగా యన
వాహాగారంబునకును*వర్తిలుఁ బేళ్లై
వ్యూహమున కాఖ్య లయ్యెను
మోహర మన నొ డ్డనంగ*మొగ్గర మనఁగన్ 25

**గుర్రాల సాల** : సాహిణం, పాగా (వాహాగారం)
**వ్యూహం :** మోహరం, ఒడ్డు, మొగ్గరం.

క. ఒనరించె ననఁగఁ గావిం
చె ననంగను సలిపె ననఁగ*జేసె ననంగాఁ
జను నాచరించె ననుటకుఁ
(గనకాచలచాప! చంద్ర*ఖండకలాపా!) 26

చేయు : ఒనరించు, కావించు, సలుపు (ఆచరించు)

**తే.** చీఁకువా లిరు లనఁగను*జీఁకటి యనఁ
దిమిరమునకు నభిఖ్య లై*తేజరిల్లు
నాఖ్య లై తనరారు ను*పాయమునకు
సుళు వనఁగ వెర వనఁగను*సూటి యనఁగ. 27





**చీకటి :** చీకువాలు, ఇరులు (తిమిరం)
**ఉపాయం :** సుళువు, వెరవు, నూటి.

**తే.** చేరువయ్యెను డాసెను*దారసిల్లె
ననఁగ సన్నిహితం బౌట*కాఖ్య లయ్యె
స్థూల మనుటకుఁ బేళ్లగుఁ*దోర మనఁగఁ
గడిఁది వలుఁద యనంగను*(గాలకంఠ!) 28

**సమీపించు :** చేరువగు, డాయు, తారసిల్లు (సన్నిహితమగు)
**స్థూలం :** తోరం, కడిది, వలుద.

**తే.** వాడెఁ గసుగందె ననఁ బుయి*లోడె ననఁగ
విన్నవోయె ననంగను*జిన్నవోయె
ననంగఁ బేళ్లకు నివి ఖిన్నుఁ*డయ్యె ననుట
(కంధకాసురహరణ! రౌప్యాద్రిశరణ!) 29

**చిన్నపోవు :** వాడు, కసుగందు, పుయిలోడు, విన్నవోవు (ఖిన్నుడగు)

**క.** గరువము మురిపం బనఁగను
బరఁగున్ గర్వంబు పేళ్లు*భటనామము లొం
టరి లెంక బం టనంగను
(బురదానవహరణ! శేష*భుజగాభరణా!) 30

**గర్వం :** గరువం, మురిపం,
**బంటు :** ఒంటరి, లెంక, భటుడు

**క.** అరదంబు తే రనంగను
బరఁగు రథంబునకుఁ బేళ్లు*పరి యన్నను గా
లరు లనఁ బదాతిసంహతి
(పురదానవహరణ! శేష*భుజగాభరణా!) 31

**తేరు :** అరదం రథం.
**కాల్బలం :** పరి, కాలరులు (పదాతిసంహతి)

**క.** సందియ మన ననుమాన మ
నం దనరును సంశయంబు*నకుఁబేర్మి గో
బృందాహ్వయంబు లలరును
మం దనఁ గోన యనఁ (జంద్ర*మఃఖండధరా!) 32

**అనుమానం :** సందియం (సంశయం)
**ఆవులగుంపు :** మంద, కోన (గోబృందం)

**క.** మొన వాఁగు దండు దళ మనఁ
దనరున్ సైన్యంబుపేళ్లు*దళవాయి యనన్
మొనకాఁ డనంగఁ బడవా
లనఁగన్ సేనాధిపతికి*నాఖ్యలు వొలుచున్. 33

**సైన్యం :** మొన, వాగు, దండు, దళం.
**సేనాధిపతి :** దళవాయి, మొనకాడు, పడవాలు.

**తే.** మైకొనియె నియ్యకొనె నొడం*బడియె నొప్పె
ననఁగ నంగీకరించుట*కాఖ్య లయ్యె
సంఘటించుట కాఖ్య లై*జానుమీఱుఁ
జెరివెఁ దుఱిమెను గీల్కొల్పెఁ*జెక్కె ననఁగ. 34

**ఒప్పుకొను, :** మైకొను, ఇయ్యకొను, ఒడంబడు(**అంగీకరించు**)
**తురుము :** కూర్చు, చెరువు, కీల్కొల్పు, చెక్కు (సంఘటించు)

**తే.** దిట్టపడియె ముక్కాఁకలు*దీరె ననఁగ
నాఱితేఱె ననం గడి*దేఱె ననఁగఁ
గసిమసంగె ననంగ నా*ఖ్యలు దనర్చు
నిపుణుఁ డయ్యె నటంటకుఁ*(త్రిపురవైరి!) 35

**అరితేరు :** దిట్టపడు, ముక్కాకలు తీరు, గడితేరు, కసిమసగు (నిపుణుడగు)

**క.** తడవు వడి కా రనంగా
నడరుం గాలంబు శిథిల*మయ్యె ననుట యౌ
విడె వీడె నూడె విచ్చెను
సడలె నురలె వదలెఁ బ్రిదిలె*జాఱె ననంగన్. 36

**కాలం :** తడవు, వడి, కారు.
**ఊడు :** విడు, వీడు, విచ్చు, సడలు, ఉరలు, వదలు, ప్రిదులు, జారు (శిథిలమగు)





క. మది డెంద ముల్ల మెద యన
హృదయంబున కాఖ్యలయ్యె*నీఱం బనఁగాఁ
బొదరి ల్లనఁగ నికుంజము
(సదయాంతఃకరణ! తరుణ*చంద్రాభరణా!) 37

**హృదయం :** మది, డెందం, ఉల్లం, ఎద
**పొదరిల్లు :** ఈరం (నికుంజం)

క. తెగ దినుసు తోయ మనఁగను
నెగడుఁ బ్రకారంబునకును*నెఱి నామము లై
మెగ మనఁగ మెక మనంగను
మృగమునకు నభిఖ్యలయ్యె*(మేరుశరాసా!) 38

**ప్రకారం:** తెగ, దినుసు, తోయం
**మృగం :** మెగం, మెకం.

క. ఎడ దవ్వు కెళ వనంగా
నడరున్ దూరంబునకు స*మాఖ్యలు నలి నాఁ
బొడి నుగ్గు తుమురు నురు మన
బెడఁగడరుం జూర్ణమునకుఁ*బేళ్లై (శర్వా!) 39

**దూరం :** ఎడ, దవ్వు, కెళవు.
**పొడి :** నలి, నుగ్గు, తుమురు, నురుము (చూర్ణం)

క. ప్రేరేచెను బురికొలిపెను
దారిచె ననఁ జోదనకును*దగు నాఖ్యలు పెం
పారును జంబూద్వీపము
నేరెడుదీవి తొలుదీ వ*నెడునామములన్. 40

**పురికొల్పు :** ప్రేరేచు, తార్చు (చోదన)
**జంబూద్వీపం :** నేరెడు దీవి, తొలుదీవి.

క. తొలఁగెం బాసె ననంగా
నలరున్ విముఖతకుఁ బ్రాప్త*మయ్యె ననుట పే
ళ్లలమె నొదవె దక్కెనియెను
నెలకొనియెన్ జెందె ననఁగ * నెక్కొనియె ననన్.
41

**దూరంగాపోవు :** తొలగు, పాయు (విముఖత)
**దొరకు** అలము, ఒదవు, దక్కొను, నెలకొను, చెందు, నెక్కొను (ప్రాప్తమగు)

క. వెనుకఁ దరువాతఁ బిమ్మట
ననఁగా నంతట ననంగ*నంత ననంగాఁ
దనరుం బశ్చాదర్థము
(కనకాచలచాప! చంద్ర*ఖండకలాపా!) 42

**తరువాత :** వెనుక, పిమ్మట, అంతట, అంతన్ (పశ్చాత్)

క. పల్ల ఱపులు రజ్జ లనం
బ్రల్లదములనంగ వ్యర్థ*భాషణములకున్
బేళ్లై వర్తిలు నోలిగ
(నుల్లోకజయాభిసరణ!*యురగాభరణా!) 43

**పనికిరానిమాటలు :** పల్లరపులు, రజ్జలు, ప్రల్లదములు (వ్యర్థ భాషణలు)

క. కైసేఁ తలంకరించుట
బేసి యనన్ విషమమునకుఁ*బేరై వెలయున్
సేసలు దీవనప్రా లన
భాసిలు మంత్రాక్షతలకుఁ*బర్యాయము లై 44

**అలంకారం :** కైసేత.
**సరికానిది :** బేసి (విషమం)
**అక్షింతలు :** సేసలు, దీవనప్రాలు (మంత్రాక్షతలు)

క. కో రనఁ బా లన నంశం
బె ఱన వాఁక యన నదికి*నెసఁగును బేళ్లై
నీరాజనంబుపే ళ్లగు
నారతి నివ్వాళి యనఁగ*(నంగజదమనా!) 45

**బాగం :** కోరు, పాలు (అంశం)
ఏరు వాక నది,
**హారతి :** ఆరతి, నివ్వాళి (నీరాజనం)







ఆ. మొఱవవోయె ననఁగ*మొద్దువోయె ననంగఁ
గుంఠమయ్యె ననుట*కుం దనర్చు
శాతమునకు నాఖ్య*లై తనరారును
జాఱుకు వాఁడి తెగువ*కఱ కనంగ. 46

మొద్దుపోవు : మొరవపోవు. (కుంఠమగు)
పదును : చురుకు, వాడి, తెగువ, కరకు (శాతం)

సీ. యామికులకు నాఖ్య*లై ప్రవర్తిలుచుండు
నారెకు లనఁగ ద*లారు లనఁగఁ
గళ్లెంబు వాగె నాఁ*గను ఖలీనంబుపే
ళ్లలరు దంతంబుపే*రౌ డనంగఁ
దఱపి నా ముదురు నాఁ*దరుణేతరం బంట
యిం చనఁ జెఱకన*నిక్షు వలరు
నష్టం బొనర్చె నం*టకు నాహ్వయము లయ్యెఁ
బోకార్చె ననఁగఁ గో*ల్పుచ్చె ననఁగఁ

తే. గుదె యనఁగ దుడ్డనంగను*గదకుఁ బేళ్లు
ఇవ మనఁగ మం చనంగను*హిమముపేళ్లు
కాన యన నడవి యనంగఁ*గాననంబు
షడ్ఢకుఁడు దోడియల్లుఁడు*జగిలెఁ డనఁగ 47

తలారి : ఆరెకుడు (యామికుడు)
పన్ను : ఔడు (దంతం)
ముదురు : తరపి (తరుణేతరం)
చెరకు : ఇంచు (ఇక్షువు)
నష్టం చేయు : పోకార్చు, కోల్పుచ్చు.
కళ్లెం : వాగె (ఖలీనం)
గద : గుదె, దుడ్డు.
మంచు : ఇవం (హిమం)
అడవి : కాన (కాననం)
తోడల్లుడు : జగిలెడు (షడ్ఢకుడు)

క. తేనియ యన జున్నన నభి
ధానంబులు మధువునకును*దనరుం బేళ్లై
పానకము చెఱకుపాలనఁ
గా నిక్షురసంబునకును*(గంతేకాలా!) 48

తేనె : తేనియ, జున్ను (మధువు)
చెరకురసం : పానకం, చెరకుపాలు (ఇక్షురసం)

క. ఉడిగెను జాలించెను నా
నడరు విరామం బొనర్చె*ననుటకుఁ బేళ్లై
తొడరుం బశ్చాద్భాగము
పెడ యనఁగా వెనుక యనఁగఁ*బిఱుఁదు యనంగన్. 49

చాలించు : ఉడుగు (విరామంబొనర్చు)
వెనుక : పెడ, పిరుదు(పశ్చాద్భాగం)

క. విడుమర యన విడుదల యనఁ
గడముట్టుట యనఁగ శాంతి*గనుటకుఁ బేళ్లౌ
నెడ వంక చక్కి చోటన
నడరు స్థలంబునకు నాఖ్య*లై (శితికంఠా!) 50

అంతమగుట : విడుమర, విడుదల, కడముట్టుట(శాంతిగనుట)
చోటు : ఎడ, వంక, చక్కి (స్థలం)

క. చనుఁ గ్రుద్ధుఁ డయ్యె ననుటకుఁ
గినిసెఁ గనలె నలిగెఁ గోప*గించె ననంగాఁ
దనరున్ మర్మములకుఁ బే
ళ్లనువు లనఁగ నెఱుఁకు లనఁగ*నాయములనఁగన్ 51

కోపగించు : కినియు, కనలు, అలుగు (క్రుద్ధుడగు)
ఆయువుపట్టు : అనువు, నెరకు, ఆయం (మర్మం)

ఆ. పరఁగుఁ బేళ్లు కార్య*కరునకుఁ బార్పత్తె
కాఁ డనంగ మణివ*కాఁ డనంగఁ
తేజరిల్లుచుండు*దేవేరి దొరసాని
రాణి యనెడుపేళ్ల*రాజపత్ని 52

నేర్పరి : పార్పత్తెకాడు, మణివకాడు(కార్యకరుడు)
రాణి : దేవేరి, దొరసాని (రాజపత్ని)

క. మ్రింగె నన గ్రుక్కగొనియె న
నంగన్ దగుఁ గబళనం బొ*నర్చె ననుటకున్
బ్రుంగె మునింగె ననంగ (న
నంగహరా!) మగ్నమయ్యె*ననుటకుఁ బేళ్లౌ 53





మింగు : గుక్కగొను ( కబళించు

ములుగు : బ్రుంగు, మునుగు (మగ్నమగు)

సీ. ఆఖ్యలై తనరు ధ*నాగారమునకు ను
గ్రాణం బనంగ బొ*క్కస మనంగ
నాస్థానమండపాహ్వయము లై తనరు హ
జారం బనంగ మో*సల యనంగ
దయకు నీరెం డభి*ధానంబు లయ్యెను
గనికర మనఁగ న*క్కటిక మనఁగ
బాల్యస్థునకుఁ బేళ్లు*బరిఢవిల్లును బిన్న
వాఁ డన గొండిక*వాఁ డనంగ

తే. సంధ్యకాఖ్యలు మునిమాపు*సంజ యనఁగఁ
జూద మన నెత్త మనఁగ దు*రోదరంబు
జడి యనఁగ వాన యనఁగ వ*ర్షంబుపేళ్లు
నోలి యుంకువ యన శుల్క*మొప్పు.(నభవ!)
54

బొక్కసం : ఉగ్రాణం, (ధనాగారం)

మొగసాల : హజారం, మోసల (ఆస్థానమండపం)

దయ : కనికరం, అక్కటికం.

చిన్నవాడు : పిన్నవాడు, కొండికవాడు (బాల్యస్థుడు)

సంధ్య : మునిమాపు, సంజ వాన : జడి (వర్షం)

జూదం : నెత్తం (దురోదరం) కట్నం : ఓలి, ఉంకువ (శుల్కం)

సీ. పయ్యెద యనఁగను*పైఁటయనంగ సం
వ్యానంబునకు నాఖ్య*లై తనర్చు
నొక్కపెట్ట ననంగ*నువ్వెత్తుగ ననంగ
యుగపత్పదంబున*కొప్పుఁ బేళ్లు
కవఱ లనం బాచి*క లనంగ నక్షముల్
బన్న మొచ్చె మనంగఁ*బరిభవంబు
వ్యాపార మగు చెయ్వ*మనఁ జెయ్వి యనఁగను
గన్ననఁ గీలనఁ*గపటచేష్ట

తే. కందుకము బంతి చెం డనఁ*గను దనర్చు
నఱవఱలు చిద్రుప లన ఖం*డాహ్వయములు
కాఁచువడియంబు లనఁగను*గైరవళ్ల
నంగ ఖాదిరఘుటిక(ల*నంగదమన!)
55

పైట : పయ్యెద (సంవ్యానం)

ఒకేసారి : ఒక్క పెట్టు(గా), ఉవ్వెత్తు(గ) (యుగపత్)

పాచిక : కవర (అక్షం)

అవమానం : బన్నం, ఒచ్చెం (పరిభవం)

వ్యాపారం : చెయ్వం, చెయ్వి

చెడ్డపని : కీలు, కన్ను (కపటచేష్ట)

బంతి : చెండు (కందుకం)

ముక్కలు : అరవరలు, చిద్రుపలు (ఖండాలు)

తాంబూలభక్ష్యాలు : కాచువడియాలు , కైరవళ్లు (ఖాదిరఘుటికలు)

సీ. మాగాని రాజ్యంబు*మణివ ముద్యోగంబు
చిట్టలు చిత్రముల్*చిలుకు శరము
ఎత్తికోలు ప్రయత్న*మీలువు మానంబు
బారి యనంగ ను*పద్రవంబు
విన్నను,వనఁగఁబ్రా*వీణ్యం బెలర్చును
దార్కాణ మనఁగ ని*దర్శనంబు
నిట్టపంట యనంగ*నిష్కారణం బంట
బానసం బనఁగ మ*హానసంబు

తే. నామ మే కాంతమునకు మం*తన మనంగ
నంతిపురమన శుద్ధాంత*మలరుచుండు
నుదిరి యనఁ దప్తకాంచన*మొప్పుచుండుఁ
దివురుట యభిలషించుట*(దేవదేవ!)
56

రాజ్యం = మాగాణి

ఉద్యోగం = మణివ, మెలిమి

ప్రయత్నం : ఎత్తికోలు

అభిమానం : ఈలువు (మానం)

ఆపద : బారి (ఉపద్రవం)

నేర్పు : విన్ననువు (ప్రావీణ్యం)

వింత : చిట్ట (చిత్రం)

బాణం : చిలుకు (శరం)

రుజువు : తార్కాణం (నిదర్శనం)

నిష్కారణం : నిట్టపంట

వంటయిల్లు : బానసం (మహానసం)

ఏకాంతం : మంతనం

అంతఃపురం : అంతిపురం (శుద్ధాంతం)

మేలిమి బంగారం : ఉదిరి (తప్తకాంచనం)

కోరు : తివురు (అభిలషించు)






సీ. బిట్టు గ ట్టనఁ బెల్లు*పెద్దయుఁ దద్దయు
నురవడి పరువడి*యుద్ధవిడియుఁ
బనివడి పదపడి*బలువిడి తలకొని
నెట్టన యెంతేని*నెఱి గరంబు
లలి వార కేడ్తె ఱ*పెలుచ వావిరి యన
నఱిముఱి యనఁ బోరిఁ*బోరి యనంగఁ
గడుఁజాల మిగులంగ*గాటం బనంగ న
త్యంతముగ ననుట*కాఖ్య లయ్యె

తే. నుడుకు సెక వెట్ట వేఁడిమి*యుబ్బ యావి
యుక్క యన నొప్పు నామంబు*లుష్ణమునకుఁ
దాల్మి యోరిమి సైరణ*తాళుకొంట
సైచు టోర్పుట యనఁగను*క్షాంతిపేళ్లు 57

చాల : బిట్టు, గట్టి, పెల్లు, పెద్ద, తద్ద, ఉరవడి, పరువడి, ఉద్ధవిడి, పనివడి, పదపడి, బలువిడి, తలకొని, నెట్టన, ఎంతేని, నెరి, కరము, లలి.వారక,ఏడ్తెర, పెలుచ, వావిరి, అరిమురి, పొరిపొరి, కడు, మిగుల, గాటము (అత్యంతం)

వేడి : ఉడుకు, సెక, వెట్ట, వేడిమి, ఉబ్బ, ఆవి, ఉక్క (ఉష్ణం)

ఓర్పు : తాల్మి, ఓరిమి, సైరణ, తాళుకొంట, సైచుట, ఓర్వటం (క్షాంతి)

తే. పెద్దనిద్దురఁ జెందించెఁ*బిలుకుమార్చె
గీటణంచెను గుదెతాల్చు*వీటి కనిచెఁ
గూలిచెను రూపుమాపెను*నేలఁగలిపె.
ననఁగ హతిచేసె ననుట కా*ఖ్యలు దనర్చు 58

చంపు : పెద్దనిద్దురచెందించు, పిలుకుమార్చు, గీటణచు, గుదెతాల్చువీటికనుచు, కూల్చు, రూపుమాపు, నేలగలుపు(హతిచేయు)

క. పరిచూర్ణ మయ్యె ననుటకు
వరుసన్ నామంబు లగుచు పర్తిలుచుండున్
దుఱుమయ్యెన్ బరుమయ్యెన్
నుఱుమయ్యెన్ బిండియయ్యె*నుగ్గయ్యెననన్ 59

పిండిఅగు : తురుమగు, పరుమగు, నురుమగు, నుగ్గగు (పరిచూర్ణమగు)

క. కునికె నిదురించెఁ గూర్కెను
గనుమోడ్చె ననంగ నిద్ర*గనుటకుఁ బేళ్లౌఁ
గనువిచ్చె ననఁగ మేల్కనె
ననఁగఁ బ్రబోధంబు నొందె*ననుటకుఁ బేళ్లౌ 60

నిద్రించు : కునుకు, నిదురించు, కూర్కు, కనుమోడ్చు (నిద్రగను)

మేల్కొను : కనువిచ్చు (ప్రబోధంచెందు)

క. డులిచె వదలించెన్ నూడ్చెను
దొలఁగించెన్ బాపె ననఁగ*ద్రోచె ననంగా
వెలికొత్తె ననఁగఁ బేళ్లై
యలరున్ విఘటనమొనర్చె*ననుటకు (శర్వా)61

తొలగించు : డులుచు, వదలించు, ఊడ్చు, పాపు, త్రోచు, వెలికొత్తు (విఘటనమొనర్చు)

క. పొలయలుక యనఁగ నెయ్యపు
టలుక యనం బ్రణయకలహ*మల రారుఁగుచం
బుల కొప్పు నామములు గు
బ్బ లనంగాఁ జన్ను లనఁగఁ*బాలిం డ్లనఁగన్ 62

ప్రణయకలహం : పొలయలుక, నెయ్యపుటలుక

చన్నులు : గుబ్బలు, పాలిండ్లు (కుచాలు)

తే. చౌటిమున్నీ రనఁగ నుప్పు*సంద్ర మనఁగ
రాజిలుచు నుండు లవణవా*రాశిపేళ్లు
కాలు వన బట్టి యనఁగను*జా లనంగఁ
గుల్య కభిధాన మై పొల్చుఁ (గుధరనిలయ!) 63

ఉప్పుసముద్రం : చౌటిమున్నీరు, ఉప్పుసంద్రం (లవణవారాశి)

కాలువ : బట్టి, జాలు (కుల్య)

తే. పెల్లగించెను పెకలించెఁ * బెఱికె ననఁగ
నాఖ్య లుత్పాటన మొనర్చె * ననుట కలరు
నాహ్వయంబులు ఛేదించె * ననుట కయ్యెఁ
జించె నన వ్రచ్చె నన వ్రక్క*లించె ననఁగ. 64

పెల్లగించు : పెకలించు, పెరకు (ఉత్పాటనమొనర్చు)

చీల్చు : చించు, వ్రచ్చు, వ్రక్కలించు (ఛేదించు)





తే. కనుమొఱఁగె నేమఱించె నాఁ * గను నిగూఢ
వర్తన మొనర్చె ననుట కా * హ్వాయము లడరు
మొయి లన మొగుళ్లనంగను * మొనయు మబ్బు
లన ఘనంబుల కాఖ్యలై * (యభ్రకేశ.) 65

ఏమరించు : కనుమొరగు,
(నిగూఢవర్తనమొనర్చు)
మబ్బు : మొయిలు, మొగుళ్లు, (ఘనం)

కం. పగ అనఁగ మార్తు రనఁగను
పగవాండ్రనఁ బగతు రనఁగఁ * బరిపంథికిఁ బే
ళ్లగు మెగ మనంగ మెక మన
మృగమునకు నభిఖ్య లయ్యె * (మేరుశరాసా!) 66

**విరోధులు :** పగరు, మార్తురు, పగవారు, పగతురు (పరిపంథి)
**జంతువు :** మెగం, మెకం (మృగం)

తే. ఇంకె నడుగంటె వట్టె నా * నివిరె ననఁగ
నిర్జలం బయ్యె ననుటకు * నెగడుఁ బేళ్లు
నిండె గ్రిక్కిఱిసె ననఁ బూ*ర్ణించె ననుట
కాఖ్య లై తనరారు (సు*ధాంశుమకుట!) 67

**ఇంకు :** అడుగంటు, వట్టు, ఇవురు (నిర్జలమగు)
**నిండు :** కిక్కిరియు (పూర్ణించు)

తే. పెచ్చు పెరిగె ననం బురి*విచ్చె మీఱె
నన విజృంభించె ననుటకు * నాఖ్య లయ్యెఁ
దిండికాఁ డనఁ దిండీఁడు * తిండిపో త
నంగ భక్షకునకు ద*నర్చుఁ బేళ్లు. 68

**పెచ్చుపెరుగు :** పురివిచ్చు, మీరు (విజృంభించు)
**తిండిపోతు :** తిండికాడు, తిండీడు (భక్షకుడు)

కం. పెనఁగొనె గిఱికొనియెను వల
గొనియెన్ మెలికొనియెఁ జుట్టు*కొనె సుడిగొనె నాఁ
గను నులిగొనె నన నాఖ్య ల
గును వలయిత మయ్యె ననుట*కును (శితికంఠా!)
69

**చుట్టుకొను :** పెనగొను, గిరికొను, వలగొను, మెలికొను, సుడిగొను, నులిగొను (వలయితమగు)

సీ. మొగరా లన స్తంభ * ములు చిట్టకము దంభ
మెరగలి వనవహ్ని * యెడ్డె మూర్ఖుఁ
డుడుగర యుపహార * మూఱట విశ్రాంతి
మొద లని యనఁగను * మూల మనుట
తఱు లన వళులు చిం * ద మనంగ శంఖంబు
తఱ టనంగఁ గశాభి * ధాన మయ్యెఁ
దమ టనఁ గీల ప * దం బగు మెట్టన
గాయకులకుఁ బేరు * గాణ లనఁగ
తే. మృత్యువునకును బే రయ్యె * మిత్తి యనఁగ
మకుటమున కాఖ్య లగు బొమి * డిక మనఁగ
నోముట యనఁగఁ బోషించు * టూడిగంబు
సేవ కభిధానమై యొప్పు * (శేషభూష!) 70

| | |
|---|---|
| **స్తంభాలు :** మొగరాలు | **మంట :** తమట (కీల) |
| **డాబు :** చిట్టకం (దంభం) | **పదం :** మెట్ట |
| **కార్చిచ్చు :** ఎరగలి ('వనవహ్ని) | **గాయకుడు :** గాణ. |
| **మూర్ఖుడు :** యెడ్డె | **చావు :** మిత్తి (మృత్యువు) |
| **కానుక :** ఉడుగర (ఉపహారం) | **కిరీటం :** బొమిడికం (మకుటం) |
| **విశ్రాంతి :** ఊరట. | **పోషించు :** ఓము. |
| **మూలం :** మొదలు | **సేవ :** ఊడిగం. |
| **ముడుత :** తరి (వళి) | |
| **శంఖం :** చిందం. | |
| **చబుకు :** తరటు (కశం) | |

సీ. ఎట్టకేల కనంగ * నెనయును సకృదర్థ
**మఖిలం** బటంటకు * నంతవట్టు
ఏకాకి యెక్క టి * నేకులు పలువురు
వేనవేల్ పెక్కండ్రు * వేవు రనఁగ
నలరు నోచేదర్ద * మై కానినాఁ డన
నేతాదృశులె యింట * కిట్టివారె
మిన్నక యూరక * యన్నఁ దూష్ణీ మర్థ
మనుసరించి యటంట * కగును దొట్టి





తే యొండొకఁ డనంగ మఱియు వే * ఱొకఁడు లాఁతి
వాఁడు పెఱవాఁడు దక్కిన * వాఁ డనంగ
నన్యునకు నాఖ్య లగుచుఁ బెం * పారుచుండు
(శయఘటితశూల వైయాఘ్ర*చర్మచేల!) 71

**ఎప్పుడో ఒకప్పుడు** : ఎట్టకేలకు (సకృత్)
**అంతా**: అంతవట్టు (అఖిలం)
ఏకాకి : ఎక్కటి
**అనేకులు** : పలువురు, వేనవేలు, పెక్కండ్రు, వేవురు.
**అలాకాని పక్షంలో** : కానినాఁడ (నోచేత్)
**ఇలాంటివారు** : ఇట్టివారు (ఏతాదృశులు)
**ఊరక** : మిన్నక ( **తూష్ణీం** ) **అనుసరించి. = తొట్టి**
**వేరొకడు** : ఒండొకడు, లాతివాడు, పెరవాడు, తక్కినవాడు (అన్యుడు)



క్రం. వడి యనఁగాఁ గాలం బగు
వడి యన వేగంబునకును * వర్తిలుఁ బేర్మై
మడి యనఁ గేదారం బగు
మడి యనఁగా శుద్ధికిని స * మాహ్వయ మయ్యెన్. 72

**వడి** : 1. కాలం, 2. వేగం
**మడి** : 1 పొలం (కేదారం) 2. శుద్ధి

కం. ఈ డనఁగ వయసుపే రగు
నీ డన సామ్యంబునకును * నెసఁగును బేర్మై
నా డన రాజ్యముపే రగు
నా డనఁ దత్కాలమం ద * నఁగఁ బెంపారున్. 73

**ఈడు** : 1. వయసు, 2. **పోలిక.** (సామ్యం)
**నాడు** : 1. రాజ్యం, 2. అప్పుడు **తత్కాలం.**

కం. మొన యన సైన్యము పే రగు
మొన యనఁగా నగ్రభాగ * మునకును బే రౌ
దొన యనఁ దూణీరం బగు
దొన యన నవసానమునకుఁ * దొడరును బేర్మై. 74

మొన : 1. సైన్యం, 2 **కొన** (అగ్రభాగం)
**దొన** : 1. అమ్ముల పొది (తూణీరం), 2. **చివర,** అవసానం

కం. వె న్న నఁగ బీజమంజరి
వెన్న నఁ జరమాంగమునకు * వెలయును బేర్మై
కన్ను లనం బర్వంబులు
కన్ను లనన్ లోచనములు * (కంఠేకాలా !) 75

వెన్ను : 1. కంకి (బీజమంజరి), 2. వీపు (చరమాంగం)
కన్ను : **క**ణుపు (పర్వం) 2. నేత్రం (లోచనం)

కం. తమ్మి యనఁ దరువిశేషము
తమ్మి యనం బంకజాభి * ధానం బయ్యెన్
నెమ్మి యనఁ బ్రియము పే రగు
నెమ్మి యన మయూరమునకు * నెగడుం బేర్మై. 76

**తమ్మి** : 1. ఒక రకం చెట్టు (తరు విశేషం), 2. తామర (పంకజం)
**నెమ్మి** : **ఇష్టం,** (ప్రియం), 2. నెమలి (మయూరం)

కం. దండ యనన్ సాన్నిధ్యము
దండన సుమమాలికాభి*ధానం బయ్యెన్
మండనఁ బ్రకోష్ఠ మయ్యెన్
మండన మృత్పాత్రకును స*మాహ్వయ మయ్యెన్. 77

**దండ** : 1. చేరువ (సాన్నిధ్యం), 2. పూలచెండు(సుమమాలిక)
**మండ** : 1. మణికట్టు (ప్రకోష్ఠం), 2. మట్టి కుండ (మృత్పాత్ర)

కం. తెలుఁగుం గబ్బపు మర్మము
తెలుఁగు కవీంద్రులకుఁ దేట * తెల్లము గాఁగన్
దెలియఁగ నడిదము సూరయ
చెలువారఁగ నాంధ్ర నామ * శేషముఁ జెప్పెన్. 78



# సూచి

## ఆంధ్రనామసంగ్రహం

### ఆంధ్రనామశేషంతో సహా

### పద పట్టిక

ఈ పట్టికలో వాడిన సంకేతాలలో 'దేవ., మాన., స్థావ., తిర్య., నానా., అనే అయిదు సంకేతాలూ వరుసగా ఆంధ్రనామసంగ్రహంలోని దేవవర్గు, మానవవర్గు, స్థావరవర్గు, తిర్యగ్వర్గు, నానార్థవర్గులను సూచిస్తాయి. ఇక – 'శేషం' అనే సంకేతం ఆంధ్రనామ శేషాన్ని తెలుపుతుంది. ఆయా సంకేతాల కెదురుగా ఇచ్చిన సంఖ్యలు ఆయా వర్గులలోని పద్యాల సంఖ్యలు. ఇక్కడ అకారాది క్రమాన్ని శబ్దరత్నాకరంలో లాగా పాటించటం జరిగింది. పర్యాయపదాలుగా సూచించిన అచ్చ తెలుగు మాటలతోబాటు ఆయా పదాల్లో వచ్చిన పూరక పదాలను కూడా చేర్చాము.

# ఈశ్వర సంబోధనల పట్టిక

(ఆంధ్రనామసంగ్రహం, ఆంధ్రనామశేషం అనే నిఘంటువులలో కవులు
ఉపయోగించిన ఈశ్వర సంబోధనలు అకారాది క్రమంలో ఇలా ఉన్నాయి)

అంగజ దమనా!
అంగజమదవిభంగ!
అంగధ్వంసీ!
అంధకవిపక్ష!
అంధకాసురహరణ!
అంబరకేశ!
అంబాకళత్ర!
అంబికేశ!
అంబుద నిభాంగ!
అగజాధీశా!
అగధన్వీ!
అగనివేశ!
అగరాట్చాపా!
అగసుతానాథ!
అఘవినాశ!
అజా!
అతిధీర!
అనంగదమన!
అనంగహరా!
అన్నపూర్ణాప్రియవల్లభ!
అభవ!
అభ్రకేశ!
అమితామరమౌనినికాయ!
అయుగనయన!
అలికనేత్ర!
అవిముక్తనిలయ!
అవిముక్తపురవిహార!
అసమనేత్ర!
అసితకంఠ!
అహమ్మతిజనదూర!
అహివిభూష!
ఆదిదేవ!
ఆర్యాసహాయ!
ఇభదైత్యహరా!
ఈశ!
ఈశ్వరీసనాథ!
ఉడుపమకుట!
ఉడురాజ్కళావతంస!
ఉమేశ!
ఉరగకేయూరసహిత!
ఉరగాభరణా!
ఉల్లో కజయాభిసరణ!

కంఠేకాలా!
కందర్పదమన!
కనకాచలచాప!
కపర్దీ!
కరిచర్మాంబర!
కలశనీరధినిషంగ!
కాత్యాయనీశ!
కాయజదమన!
కాలకంఠ!
కాశికాపురివరనిలయా!
కాశీనివాసలింగ!
కాశీనివేశ!
కుధరచాప!
కుధరనిలయ!
కృత్తివాస!
గజదానవారి!
గరళకంఠ!
గిరీశ!
గుహగజాననసనాథ!
గౌరీమిత్రా!
గౌరీరమణా!
గౌరీశా!
ఘనతరగోరాజగమన!
చంద్రఖండకలాపా!
చంద్రమఃఖండధరా!
చంద్రమావతంస!
చంద్రమౌళి!
చంద్రరేఖావతంస!
చంద్రార్థధరా!
చంద్రార్థమకుట!
చర్మవసన!
చిత్రప్రకాశ!
జగదీశా!
తరణిశీతాంశుశిఖినేత్ర!
తరుణచంద్రాభరణా!
తీరుణేందుధరా!
త్రినేత్ర!
త్రిపురవైరి!
త్రిపురహరణ!
దర్పకదమనా!
దక్షయజ్ఞమథన!
దేవదేవ!

ద్రుహిణాదిసురనంత!
ధనదమిత్ర!
ధరాశతాంగ!
ధవళగాత్ర!
ధవళవృషతురంగ!
ధూతకలుష!
ధృతకురంగ!
నందివాహ!
నాగకేయూర!
నాగభూష!
నాగహార!
నీలకంఠ!
పంకజాతాక్షసన్మిత్ర!
పన్నగవిభూష!
పర్వతధన్వీ!
ప్రమథగణేశా!
ప్రమథసంచయసనాథ!
పాండురాంగా!
పినాకపాణి!
పినాకహస్త!
పురదానవహరణ!
పురారి!
ఫాలనేత్ర!
బాలేందుధరా!
భర్గ!
భవ!
భావజదమనా!
భాసితసితాంగ!
భక్తవిధేయ!
భీమ!
భుజగవరహార!
భూతిమండితకాయా!
మదనదమన!
మనసిజదమనా!
మహాసేనజనక!
మహీధరచాప!
మహేశ!
మృగధరాంక!
మేరుచాప!
మేరుశరాసా!
మేరుశైలచాప!
మౌనిమానసవిహార!

మౌళిధృతగంగ!
రజతగిరినివాస!
రజతనగవిహార!
రమ్యధవళాంగ!
రాజమకుట!
రుద్ర!
రౌప్యకుధరనిలయ!
రౌప్యాద్రిశరణ!
వామదేవ!
వారధినిషంగ!
విగతభవపాశ!
వినుతకరుణాసనాథ!
వివిధగుణసనాథ!
విశ్వనాథ!
విశ్వాధిపతి!
విషమనేత్ర!
వృషభవాహ!
వృషవాహ!
వైయాఘ్రచర్మచేల!
శమనదమన!
శయఘటితశూల!
శరా!
శశాంకకళావతంస!
శారదాంబుదనిభాంగ!
శితకంఠా!
శివా!
శీతాంశుఖండమౌళి!
శూలపాణి!
శేషభుజగవిభూషా!
శేషభుజగాభరణా!
శేషభూష!
శేషాహిభూషితాంగ!
శైలజానాథ!
శైలదేహ!
శైలనివేశ!
శైలనిశాంతా!
శ్రీమహేశ!
సదయాంతఃకరణ!
సర్వజ్ఞా!
సుధాంశుమకుట!
సుధాకరమకుటా!
సురమునిసిద్ధసేవ్య!
హతమారజితా!

